# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు అకుపచ్చ
రంగులలో లభించును.



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

# ఆరోగ్యం, పొదుపు మరియు పరిశుభ్రతకు మేలైన మూడు వస్తువులు

# రామా

## స్టెయిన్‌లెస్ స్టీల్ హీటర్ డ్రమ్, వాటర్ ఫిల్టర్, హాట్ క్యారియర్













### హీటర్ డ్రమ్

నిర్మాణంలోనే అమర్చబడిన "స్ప్రియర్ హాట్" వేడిచేసే పరికరము గలది

తక్కువ కరెంటు శక్తితో తక్షణమే వేడినీరు అందించటంలో పేరుపొందిన 32 లీటర్ల డ్రమ్ అన్నిటికన్నా మిక్కిలి పొదుపైనది కూడా!

### వాటర్ ఫిల్టర్

సూక్ష్మజీవులు, బాక్టీరియా, ధూళి మొ॥ వాటినుండి 100% రక్షణ, జపాన్‌నుండి దిగుమతి చేసుకొన్న స్టెయిన్‌లెస్ స్టీల్ నుండి తయారు చేయబడి మిగిలిన వానికంటే పరిశుభ్రతలో మిక్కిలి శ్రేష్ఠమైనది.

### హాట్ క్యారియర్

మీ ఇంటినుండి అప్పుడే తీసుకొచ్చినట్లుండి, వేడి ఆవిర్లు గక్కే మధ్యాహ్న భోజనం, ఇది 28-G దిగుమతి చేసుకొన్న నవ్యమైన స్టెయిన్‌లెస్‌స్టీల్ నుండి తయారు చేయబడినది ఆహార పదార్థములను 4 నుండి 6 గంటల వరకు వేడిగా ఉంచుతుంది ఐస్‌క్రీమ్ మొ॥ వాటిని చల్లగా ఉంచుతుంది కూడా

భోజనంకోసం ఇంటికి రాలేనివారికి వరప్రసాదిని

మేలైనవని అనే అన్నింటికన్నా మిక్కిలి మేలైనది

**RAMA** STAINLESS STEEL PRODUCTS

అన్ని ముఖ్యమైన స్టెయిన్‌లెస్‌స్టీల్, కిచన్‌వేర్, క్రాకరి, ఎలక్ట్రికల్, జనరల్ మరియు డిపార్ట్‌మెంట్ స్టోర్‌లందు లభించును.



ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు

**మహావీర్ ఏజన్సీస్**

PH : 221198/34819

తిలక్ రోడ్, హైదరాబాద్-1

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
**దేశోద్ధారక కాశీనాధుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం 1908
**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం 17-23 మే 1985

శ్రీ క్రోధన నామ సం వైశాఖ బ త్రయోదశి
**సంపుటము 77 : సంచిక 37**
సంపాదకుడు
**శివలెంక రాధాకృష్ణ**

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మాసాల చందా | రు | 55-90 |
| పోస్టులో ఏడ్దాది చందా | రు | 111-80 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


ముఖచిత్రం
[illegible] కృష్ణ

**కథలు :**

| | |
|---|---|
| ఆటుపోటులు | 22 |
| గుణపాఠం | 31 |
| గూడు విడిచిన పక్షులు | 49 |
| శ్రమ - ఫలితం | 64 |

**సీరియల్ నవలలు:**

| | |
|---|---|
| మల్లిక | 12 |
| పడమట సంధ్యారాగం | 26 |
| ప్రేమించవే మనసా | 42 |
| రాగసంధ్య | 54 |

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు-7 న్యూఢిల్లీ లేఖ-8 వ్యక్తిగతం వారఫలం-10 బయోగ్యాస్ ఇతర పదార్థాల ఉపయోగం-18 డాక్టర్ సలహాలు-24 దర్మపదం-30 సినిమా విశేషాలు-34 ఇరుగు పొరుగు-40 ప్రశ్నావళి-47 ఇ వేమన పద్యాలు-52 సుభాషితాలు-59 హైదరాబాద్ నోట్‌బుక్-61 పాలాక్షుని డైరీ-62





## ముఖచిత్రం

ముఖచిత్రంగా మా అబిమాన నటుడు యంగ్ డైనమిక్ అండ్ డేషింగ్ హీరో చిరంజీవిగారిని చిత్రించినందుకు మా కృతజ్ఞతలు

ఎన్ వి వి ఆనందకుమార్, యలమంచిలి

## హైదరాబాద్ నోట్‌బుక్

మార్చి 22-28 సంచికలో హైదరాబాద్ నోట్‌బుక్‌లో తిరుమల రామచంద్రగారు శ్రీ రామారావు విజయం గురించి వ్రాసిన విషయం చాలా బాగుంది వారు చెప్పిన జోస్యం నిజమయింది ఆరు కోట్ల ఆంధ్రుల అబిమానము చూరగొన్న వ్యక్తి అన్నగా పిలువ బడుచున్న మహామనీషి శ్రీ రామారావుగారిని కొందరు దర్భాష లాడారు ఆ విషయాలు కూడా రాస్తే బాగుండేది

ఎస్ తాతారావు, గండేపల్లి

## జాగ్రత్త పడాలి!

22-28 మార్చి పత్రికలో సూరి' చెప్పినట్లు ప్రతి పక్ష రాజకీయవాదుల నోటినుండి పదేపదే 'కాంగ్రెస్ సంస్కృతి', 'కాంగీ సంస్కృతి' అనే అవహేళన పద జాలం వినిపించడం ఒక ప్యాషన్ అయిపోయింది స్వార్థం, దురాశ, బూటకం పునాదిరాళ్ళుగా వున్న ఒక రకమైన నీచ రాజకీయ సంస్కృతి ఈ దేశంలో పాతుకుపోయింది ఈభయంకరమైన నిజాన్ని ఎవరూ దాచలేరు కాని, ఈ సంస్కృతికి 'కాంగీ సంస్కృతి' అని ముద్దు పేరు పెట్టుకొని కేవలం మాటల్లో వ్యర్థ పోరాటం సాగిస్తున్నారే తప్ప చేతల్లో ఆ సంస్కృతిని తరిమికొట్టే నిజాయితీ ప్రభుత్వం యింతవరకు ప్రతిపక్ష రాజకీయవాదులు చేపట్టనేలేదు'కుళ్ళుని కడిగే ప్రయత్నం చెయ్యకుండా ఆ కుళ్ళునే ఎరువుగా వాడుకొని తమ తమ రాజకీయ 'పంటలు' పండించుకోవాలనే తాపత్రయం కొట్టొచ్చినట్లు కనబడుతోంది వీరిలో విడ్డూరం ఏమంటే, ఎవరైతే ఈ కుళ్ళు సంస్కృతి నుండి అతిగా వ్యక్తిగత లాభాలు పొందా రో, వారే ముప్పుడు బూటకపు నీతి వ్యాకాలు పలు కుతూ దేశాన్ని ఉద్ధరిస్తామంటూ రాజకీయరంగ ప్రవేశంచేసి ప్రజల్ని మభ్యపెడుతున్నారు అందుకే, ఆంధ్రప్రదేశ్, పశ్చిమ బెంగాల్‌వంటి రాష్ట్రాలలో ప్రభుత్వాలు మారినా కుళ్ళు సంస్కృతి అల్లాగే వుండి పోయి యింకా విజృంబించింది ప్రతిపక్ష రాజకీయ వాదులు దెయ్యాన్ని తరిమేస్తాం అంటూ ప్రగల్భాలు పలికి భూతాల్ని దేశంమీదకి తెస్తున్నారు ప్రజలు జాగ్రత్త పడాలి

టి యస్ రావు విశాఖపట్నం

## శ్రీ వరదరాజన్ మొదలియారు సహాయం

డా దుబాషీని గురించి నేస్తం రాసిన దానికి అనుబంధంగా ఒక అంశం-

శివసేన నాయకుడు శ్రీ బాల్‌ఠాక్రేకి దక్షిణాది వారంటే కోపం ఎందుకంటే వారిలో చాలా మంది నేరాలు చేస్తారనిట బొంబాయిలో స్మగ్లర్‌లలో మలయాళీలు చాలా మంది ఉన్నారని ఆయన అనే వారుట అటువంటి వారితో బా జ పా వారు పొత్తు కుదుర్చుకున్నారు సరే, బాగానే ఉంది! కాని, భా జ పా నాయకుడు శ్రీ రామ్ జఠమలానీయే శ్రీ హాజీమస్తాన్‌కి లాయరు శ్రీ హాజీమస్తాన్‌కే కాదు ఆయన సహచరుడు శ్రీ వరదరాజన్ మొదలియారుకి కూడా

ఇటీవలి ఎన్నికలలో భా జ పా అబ్యర్థి శ్రీ రుస్తుమ్ తీరందాజ్ కోసం శ్రీ వరదరాజన్ మొదలియారు ప్రచారం చేసి పెట్టారుట అందుకనే ఆయనకి కనీసం 9000 వోట్లు తక్కువ వచ్చాయని పత్రికలలో రాశారు

కాంగ్రెసు (ఐ) వారు వీళ్ళతో సావాసం చేస్తున్నారు వాళ్ళతో సావాసం చేస్తున్నారు- అన్న మాటలు వినపడుతూ ఉంటాయి శ్రీయుతులు హాజీమస్తాన్, వరదరాజన్ మొదలియారులు పవిత్రులా? అమలిన చరిత్రులా?

జి రామలింగం, మదరాసు

## కథలు

5–4–85 టు 11–4–85 ఆంధ్ర సచిత్ర వారపత్రిక లో ముఖ్యంగా మమ్మల్ని ఆకర్షించిన కథ సిఫార్సు వాస్తవానికి చాలా దగ్గర్లో వుంది

వి నాగేశ్, వి సుధారాణి ఖుర్దారోడ్

## కథలు

5-11, నటి రేవతి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా వుంది డబ్బుముందు స్నేహాన్ని, కృతజ్ఞతను మరిచి పోతారని సిఫార్సు కథలో సూర్యప్రకాశరావు పాత్ర ద్వారా రచయిత చక్కగా నిరూపించారు

జిట్టా రమణి మోహన్, కడప

## సీరియల్స్

5–11 నాటి రేవతి ముఖచిత్రం కళ్ళు మిరుమిట్లు గొలిపేలా ఉంది పడమట సంధ్యా-రాగం సీరియల్ చక్కగా సాగుతోంది ఛాయ, సుధీర్‌ల ప్రయాణం, మధ్య మధ్య సంబాషణలు రచయిత్రి చక్కగా వ్రాసారు

జి రామం, బొబ్బిలి □




# ప్రత్యామ్నాయాన్ని ప్రజలముందు ఉంచలేని ప్రతిపక్షాలు!

పీటర్ సిద్ధాంతాన్ని బట్టి ప్రతి వ్యక్తి తన అసమర్థత స్థాయిని అనుసరించే ఉంటాడు ఇప్పుడు నేనిక్కడ మొట్టమొదటిసారిగా ప్రతిపాదిస్తున్న దుబాషి సిద్ధాంతం ప్రకారం ప్రతి రాజకీయ పార్టీ అది చేసే అర్థంలేని ఆర్భాటాన్ని బట్టే ఉంటుంది ఆ ఆర్భాటం అయిపోయిన తర్వాత ఏ విధంగా చూసినా ఆ పార్టీ ఉండదు

శ్రీమతి గాంధి 1977 ఎన్నికలలో ఓడిపోయినప్పుడు చాలా మంది, ముఖ్యంగా జనతావారు, ఇక ఆమె పని అయిపోయిందని, అంతా మంచికే జరిగిందని అన్నారు మొదటి ఆరు నెలలూ ఇక ఆమె తిరిగి అధికారంలోకి రానట్టే అనిపించింది వృత్తిరీత్యా ఆమె ఇంటితో సంబంధం ఉన్న మాలాంటి వారికి మాత్రం సందేహంగానే ఉండేది ఆమె అనుచరులలో చాలామంది మరో కాంగ్రెసుకి మారిపోయారు ఆమెని అంటి పెట్టుకుని ఉన్న మిగతా వారు కూడా పార్టీని వదలి వెళ్ళాలా వద్దా అన్న సందిగ్ధంలో పడిపోయారు అయితే సంవత్సరం లోపే శ్రీమతి గాంది తమ పార్టీని చీల్చారు తాము అనవసరం అనుకున్న వారినందరినీ వదిలించుకున్నారు రెండేళ్ళు కాకముందే ఆమె తిరిగి పార్లమెంటులో అడుగు పెట్టారు ఈ రెండేళ్ళలో ఆమె తమ చుట్టూ ఉన్న వారికి ముఖ్యంగా అధికారంలో ఉన్న పార్టీ వారికి బాగా తలనెప్పిని కలిగించారు ఆమె తరువాతి ఎత్తు ఏమిటో తెలియక జనతా పార్టీ నాయకులు తికమక పడ్డారు చివరికి ఆమె వారిని చిత్తు చేశారు మొదట వారి పార్టీని చీల్చి, తర్వాత వారిని ఎన్నికలకి తీసుకు వెళ్ళి ఓడించి ఘన విజయాన్ని సాధించారు

ఆ సమయంలో ఆమె ఎత్తుగడలని గురించి ఎవరూ అంతగా రాయలేదు ప్రతిపక్షంలో ఉన్న ఒక పార్టీని గురించి శాస్త్రీయంగా అధ్యయం చేసినట్లు వాటిని పరిశీలించాల్సి ఉంటుంది ప్రతిపక్ష పార్టీ అంటే అలాగే ప్రవర్తించాల్సి ఉంటుంది ఆర్భాటం అసలే లేని ప్రతిపక్ష పార్టీ అసలు ప్రతిపక్ష పార్టీయే కాదు రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నప్పుడు జాతీయ ప్రభుత్వంలో చర్చిల్, అట్లీ కలిసి పని చేశారు కానీ వారి పార్టీలు కలిసి పని చెయ్యలేదు అన్యూరిన్ బెవాన్ యుద్ధానంతరం అట్లీ ప్రభుత్వంలో ఆరోగ్య మంత్రిగా పని చేశారు యుద్ధం జరుగుతున్నంత కాలం ఆయన చర్చిల్‌కి గొంతులో పచ్చి వెలక్కాయలాగా ఉండేవాడు అలాగే ఇమాన్యుయెల్ షిన్‌వెల్ కూడా చర్చిల్ మంత్రివర్గ సభ్యులొకరిని మొహం పగిలేలా కొట్టారట ఆ మంత్రి లేబర్ పార్టీ వ్యవస్థాపకులొకరిని గురించి చాలా అసహ్యకరంగా వ్యాఖ్యానించి నందుకు షిన్‌వెల్ ఆ పని చేశారట టోరీ అయినా సోషలిస్టు అయినా ప్రతి ఇంగ్లీషు వాడికీ జీవన్మరణ పోరాటంగా ఉన్న ఆ యుద్ధ కాలంలో కూడా లేబర్ పార్టీ కలిగించే చికాకుని భరించక తప్పలేదు ప్రతిపక్ష పార్టీగా దాని ఉనికిని నిలబెట్టడానికి అట్లీ మొదలగువారు ప్రభుత్వంలో ఉన్నప్పటికీ అది ఆ విధంగానే ఉండాలనుకున్నారు అప్పుడు ఆ పార్టీ తెచ్చుకున్న ఆ గుర్తింపు వల్లనే అది 1945 ఎన్నికలలో ఉన్నత స్థానానికి రాగలిగింది

భారతదేశంలో మన పార్టీలకి తాము ఏకాకులమై పోతామేమోనన్న భయం పట్టుకుని పీడిస్తూ ఉంటుంది అందుకే అవి ఎప్పుడూ ఏదో ఒక ఫ్రంట్‌లో చేరిపోతుంటాయి అయినా ఆ ఫ్రంట్‌లు కొద్ది నెలల కన్నా ఎక్కువ కాలం నిలవలేవు ఈ ఫ్రంట్‌లనేవి పైన ఉన్న కొద్ది మంది నాయకులు తమకి అనుకూలంగా ఏర్పాటు చేసుకునేటటువంటివే కానీ పార్టీలో కింద నించీ పైవరకూ ఉండే యంత్రాంగానికీ, వాటికీ ఏమాత్రం సంబంధం ఉండదు ఒకే నాయకుడు ఉండి కింద పార్టీ యంత్రాగం అంటూ ఏదీ లేని డి ఎం కె పి లాంటి పార్టీలకి అయితే ఫర్వాలేదు కానీ మిగతా పార్టీల విషయంలో, ముఖ్యంగా కేడర్ ఉన్న వాటికి ఫ్రంట్‌లో చేరడం ఆత్మహత్యా సదృశమే అవుతుంది వాటి నాయకులు ఫ్రంట్ సమావేశాలకి హాజరు కావడం, పత్రికా సమావేశాలలో ప్రసంగించడం ద్వారా ప్రయోజనం పొందుతారు కానీ ఆ పార్టీలు బలహీనమైపోతాయి

ఇప్పుడు భారతదేశంలో మనకి జాతీయ ప్రతిపక్ష పార్టీలనేవి లేవు వాటిలో ఏ ఒక్క పార్టీ కూడా తనదైనటువంటి ప్రత్యామ్నాయాన్ని ప్రజల ముందుకి తేలేకపోతున్నది విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ బడ్జెట్‌నే తీసుకోండి కొత్త ప్రభుత్వం ప్రకటించిన మొట్ట మొదటి ఆర్థిక, రాజకీయ ప్రకటన అది ఇందిరాగాంధీ విధానాల నుంచి దూరం కావడానికి ప్రభుత్వం చేసిన ప్రథమ ప్రయత్నం కానీ దానిని విమర్శించడానికి దొరికిన ఒకే ఒక సాకు అది ద్రవ్యోల్బణాన్ని పెంచే బడ్జెట్ అని నిజమే అది ద్రవ్యోల్బణానికి దారి తీసేదే అది 1979–80కి చరణ్‌సింగ్ ప్రతిపాదించిన ఘోరమైన బడ్జెట్ వంటిదే కానీ ద్రవ్యోల్బణం అనేది తాత్కాలికమైనది తమ విధానాలలో దీర్ఘకాలిక ప్రాతిపదిక మీదే ప్రతిపక్ష పార్టీలు దృష్టిని కేంద్రీకరించాలి ప్రణాళికని తక్కువ చేయడం, ప్రభుత్వరంగం ప్రాముఖ్యాన్ని పెంచడం జరుగుతున్నది కమ్యూనిస్టులు ఇది చేస్తున్నారు అలా చెయ్యడమే వారికి సరిపోతుంది కాబట్టి కానీ మిగతా ప్రతిపక్షం మాటేమిటి? ప్రభుత్వరంగం ఎక్కువ అధికారాలని ప్రభుత్వం చేతికి అందిస్తున్నదని, ఏ విధంగా చూసినా అది అసమర్థత వల్ల ప్రగతిని నిరోధిస్తున్నదనీ వాళ్ళు పెద్దగా చెబుతున్నారు. రాజీవ్‌గాంధీ కొత్తవిదానాన్ని గురించి మీరు ఏమైనా చెప్పండి కానీ దాని కొక విధమైన నిండుదనం ఉన్నది పాల్కీవాలా వంటి ప్రముఖులు దానిని మెచ్చుకున్నారు ఆయన దానికి కట్టుబడి ఉంటారని నేను చెప్పలేను కానీ వచ్చే ఎన్నికలలోగా పేద ప్రజలని తాము విస్మరించలేదని చెప్పడానికైనా ఆయన తిరిగి తమ విధానాన్ని మార్చుకోవచ్చు

అయితే ప్రతిపక్షం ఏ దృష్టితో దీనిని గమనిస్తుంది? అది చిన్నదయినా, పెద్దదయినా పరిశ్రమ అంటేనే ఇష్టంలేని, ఆధునీకరణ గురించి పట్టించుకోని, శాస్త్ర విజ్ఞానం అవసరమేలేని చరణ్‌సింగ్ గ్రామాలలో ఉండే తమ అనుచరులకి తిరుగుబాటు రాజకీయాలే వారికి మేలు చేయగలవని చెప్తే నేను అర్థం చేసుకోగలను జనతాపార్టీ కూడా ఒక విధమైన పురాతన గ్రామీణ వ్యవస్థ పైనే ఆధారపడింది ఆధునీకీకరణ ఉన్నత సాంకేతిక పరిజ్ఞానం నియంతృత్వానికి దారితీస్తాయని అది నమ్మింది మరి భారతీయ జనతాపార్టీ సంగతి ఏమిటి? మిగతావాటితో పోలిస్తే దాని స్థానం ఎక్కడ?ఆదునీకీకరణపై దానికి నమ్మకం ఉన్నదా, లేదా? సాంకేతిక పరిజ్ఞానం మీద దానికి నమ్మకం ఉందా? అయితే దానివల్ల సమాజంలో ఏర్పడే వొత్తిడులని ప్రజాస్వామ్య

పరిదిలో తగినట్లు అది వ్యవహరించగలదా? దేశంలో అన్ని చోట్లా ఇదే రకమైన ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి అదికార పక్షానికి జాతీయ ప్రత్యామ్నాయం అని చెప్పుకునే ఏ పార్టీ అయినా దాని ప్రత్యామ్నాయ విదానాలని ప్రజల ముందు ఉంచాల్సి ఉంటుంది

నిజమైన ప్రతిపక్షం కావాలంటే ప్రభుత్వం చేసే ప్రతి దానినీ వ్యతిరేకించనక్కరలేదు అలాంటి వ్యతిరేక స్వబావం గల ప్రతిపక్షాల వల్ల అధికారంలో ఉన్న పార్టీకే మేలు జరుగుతుంది ప్రభుత్వాన్ని ప్రతిపక్షం హెచ్చరించేదిగా ఉండాలి జరగబోయే దుష్పరిణామాన్ని గురించి అది తగినంత ముందుగా ప్రభుత్వాన్ని హెచ్చరించేదిగా ఉండాలి అలాంటి హెచ్చరికలు ఆ పార్టీ ప్రాథమిక సూత్రాలనించి రావాల్సి ఉంటుంది. అలాంటి నియమాలు పార్టీ విధానాలు మారినప్పటికీ స్థిరంగా ఉండాలి.

అమెరిగా సంయుక్త రాష్ట్రాలలోని రిపబ్లికన్‌లు, డెమోక్రాట్‌లు పేరుకి మాత్రమే వేరని మనం అనుకుంటాము. కానీ అమెరికన్‌లు మాత్రం అలా అనుకోరు. వారిలో అంతర్లీనంగా కొన్ని విభేదాలున్నాయి. అమెరికన్ సమాజం సుస్థిరమైనది కాబట్టి సమాజంలోని తేడాలు కూడా అంతర్లీనంగానే ఉంటాయి. అలాగే బ్రిటన్‌లో కూడా 200 సంవత్సరాల క్రితం ఉన్న టోరీ పార్టీకీ,ఈనాడు ఉన్న టోరీ పార్టీకి చాలా వ్యత్యాసం ఉన్నది. కానీ టోరీలకీ లేబర్‌పార్టీ వారికీ ఉన్న లోతైన అభిప్రాయభేదాలు ఎప్పటిలాగే ఉన్నాయి. వాళ్ల ప్రాథమిక నియమావళి ఏమాత్రం మారలేదు. వారిలో పార్టీ మార్పిడులు చాలా కొద్దిగా ఉండటానికి అదొక కారణం. మన భారతదేశంలో ప్రతి పార్టీకి ఒక ఎన్నికల ప్రణాళిక ఉంది. కానీ జాగ్రత్తగా గమనిస్తే వాటిలో అంత తేడా ఏమీ కనిపించదు. ఎప్పుడైతే ఒంటరిగా మిగిలి పోతామేమోనన్న భయం ఉంటుందో అప్పుడే రాజీ ప్రసక్తి వస్తుంది. మొదట విధానాలలో, తర్వాత ప్రాథమిక నియమావళి విషయంలో రాజీ పడక తప్పదు. ఆ విధంగా నెమ్మదిగా ఆ పార్టీ గుర్తింపుని కోల్పోతుంది. అభిమానులు దూరమవుతారు. చివరికి ఆ పార్టీ ఆర్భాటం చేసే స్థితిని కూడా కోల్పోయి నామరూపాలు లేకుండా పోతుంది. మొట్ట మొదటి సార్వత్రిక ఎన్నికలలో ఓట్లలో రెండో స్థానం సంపాదించిన ఆనాటి సోషలిస్టు పార్టీ ఏమైంది? ఆ ఓటమి నుంచి ఇంకా అది కోలుకోలేక పోవడమే కాక రూపుమాసిపోయింది. దాని నాయకులు మాత్రమే ఆ పాత నినాదాలని ఇంకా ఇస్తూ ఉన్నారు. వాటిని ఎవరూ పట్టించుకోరు. భారతదేశంలో సోషలిస్టులు వాళ్ళు చేసిన ఆర్భాటాన్ని బట్టే ఉన్నత స్థానానికి రావడం లేదా పడిపోవడం జరిగింది. ఇవాళ వాళ్ళు నామరూపాలు లేకుండా పోయారు. మిగతా వారి విషయంలో కూడా అలాగే జరగవచ్చు. □

## వ్యక్తిగతం



ఛార్లెస్ గరుముఖ్ శోభరాజ్ భారతీయుడైన తండ్రికీ, వియత్నా మహిళ అయిన తల్లికీ సైగాన్‌లో జన్మించిన ఫ్రెంచి పౌరుడు! ఈ శతాబ్దపు నేరస్తుల తలదన్నిన వాడిగా ప్రపంచం ఈయనని గుర్తించింది హత్యలు, దోపిడీలు, దొంగ రవాణా, మాదకద్రవ్యాల విక్రయం, దొంగనోట్లు అచ్చు వెయ్యడం, అమ్మాయిలని తార్చడం లాంటి పెద్ద పెద్ద నేరాలెన్నో ఈయన మీద ఉన్నాయి

1974 లోనే ఈయన బొంబాయిలోని ఒక ఆసుపత్రిలో 'ఎపెండిక్స్' ఆపరేషన్ కోసం చేరినప్పుడే పట్టుబడి ఉండాల్సింది కానీ ఎలాగో తప్పించుకున్నాడు ఢిల్లీలో టూరిస్టు గైడ్‌గా చెప్పుకుంటూ తిరుగుతున్న ఈయనని 1981 లో పోలీసులు అరెస్టు చేశారు మాదకద్రవ్యాలని సరఫరా చేస్తున్న ఈయనని, కెనడాకి చెందిన ఈయన భార్యనీ అరెస్టు చేశారు ఎన్నో కోర్టులు, జైళ్లు తిరిగి చివరికి 1984 లో కర్నాటకలోని కార్వార్ జైలులో శిక్ష అనుభవిస్తున్న ఈయన త్వరలో విడుదల కాబోతున్నాడు విదేశాలలో కూడా ఎన్నో నేరాలలో ఈయనపై అరెస్టు వారంట్‌లు ఉన్న కారణంగా విడదల అయ్యే లోపే మళ్లీ ఈయనని ఢిల్లీ తిహార్ జైలుకి మార్చవచ్చు జైల్లో ఖైదీలందరి కన్నా ఈయనకి ప్రత్యేక మర్యాద, సౌకర్యాలు లభిస్తాయి వారణాశి జైల్లో ఉన్నప్పుడు ఈయన అమెరికన్ రచయిత్రి షెరీన్ వాకర్‌ని, 1981 నవంబరు 15న రెండవ భార్యగా వివాహం చేసుకొని వార్తలలోకి ఎక్కాడు భోపాల్ విషవాయు బాధితుల కేసులు తీసుకోమని ఈయన అమెరికాలోని తమ లాయర్లకి రాసినట్లు చెప్పారు కొంత పెట్టుబడి పెట్టినా అది బంగారు గని అని, బాధితులకి సహాయపడినట్లూ ఉంటుంది బాగా డబ్బూ చేసుకోవచ్చు అన్నాడాయన హాలీవుడ్ నిర్మాత ఒకరు ఈయన కథని ఈయన్నే పెట్టి చిత్రంగా తీద్దామని చూస్తున్నాడట 'సర్పెంటైన్', 'లైఫ్ అండ్ క్రైమ్స్ ఆఫ్ ఛార్లెస్ శోభరాజ్' అనే పుస్తకాలు అచ్చు కావడానికి సిద్ధంగా ఉన్నాయి లైఫ్ అండ్ క్రైమ్స్ రచయితలైన రిచర్డ్ నెవెల్లీ, జూలీక్లార్క్‌లతో నేను వ్యాపారవేత్తనే కానీ నేరస్తుడిని కాను నేనెప్పుడూ మంచివాళ్లని చంపలేదు' అన్నాడట శోభరాజ్ □

# వారఫలం

## 17-5-1985 శుక్రవారం మొదలు 23-5-1985 గురువారం వరకు

★ **మేషం** చాల మార్పులు గ్రహగతితో కనిపించుచున్నాయి అన్నీ మీకు అనుకూలమే దన రాబడికి, అప్పులు వసూలు కావటానికి, వ్యాపారం బాగా సాగటానికి అనుకూలం స్త్రీలకు నాలుగు రీతులా ప్రగతికి అవకాశం

★ **వృషభం** గ్రహించండి, ముందు ముందు మీకు అనేక విదాల, అనేక రంగాలలో మేలు కనిపించగలదని ఈ వారం గాడంగా నమ్మే అనుకూల్యత ఏర్పడుతుంది అనవసరంగా వ్యర్థ పేచీలలో దిగవలసిన అగత్యం ఏర్పడుతుంది, జాగ్రత్త స్త్రీలకు వృత్తి ఉద్యోగాలు, దనాదాయంలో మేలు చెప్పదగిన అంశం

★ **మిథునం** అనాయాసంగా దన రాబడి కనిపిస్తుంది లేదా అప్రయత్నంగా డబ్బు అందుతుంది 'లాటరీ' పలించుటకు అవకాశం, తద్వారా ఆదాయం, అందు మూలాన కొన్ని చిక్కులు నివృత్తి కావటం గమనించదగిన అంశాలు స్త్రీలకు చిక్కులు ఏర్పడతాయి ఓర్మితో సంచరిస్తే తప్ప తగిలే దెబ్బలు తట్టుకోలేరు

★ **కర్కాటకం** మాటకు అదిక గౌరవం మన్నన, సాటివారితో అనుకూలతకు ఆస్కారమున్నది పోయిన వస్తువులు భోగట్టా తెలిసికొని సంతోషిస్తారు ఈ వారం దూరపు ప్రాంతాలకు ప్రయాణించుటకు అవకాశాలేర్పడుతాయి స్థితి యందు అంతో యింతో మార్పు కనిపిస్తుంది స్త్రీలకు అన్ని విదాలా మేలే

★ **సింహం** మాటల్లో, చేతల్లో, ఎంతో జాగ్రత్త చూపాలి చిక్కినట్లే చిక్కి కొన్ని సదవకాశాలు జారిపోయే మార్గమున్నది జాగ్రత్త వహించాలి నూతన గృహ నిర్మాణంపై ప్రబలమైన ఆసక్తి కొందరు చూపుతారు ఆరోగ్యరీత్యా జాగ్రత్త పడాలి ఔషద సేవ తప్పదు స్త్రీలకు ఆరోగ్య బంగం చెప్పదగిన ముఖ్యాంశం ఇంట దొంగతనానికి 'మంగళవారాన' ఆస్కారం

★ **కన్య** సాటివారితోనో పరిచితులతోనో, మిత్రులతోనో అనవసరంగా తగాదకు దిగవలసిన పరిస్థితులుంటాయి గమనించండి శాంత ప్రకృతి అవసరం ఒకానొక విషయంలో మీ మాటే నెగ్గగలదనీ గ్రహించగులుగుతారు వారమంతా విదీ విరామం లేకుండా పనిచేయవలసిన అగత్యమున్నది స్త్రీలకు విశిష్ట కార్యాలందు విజయ సూచన, ఉద్యోగమందు ఆశించిన పెంపు సంభవం

★ **తుల** చిత్తశుద్ధితో మీరు గావించిన రాజకీయ, సాఘిక వ్యవహారాలకు ఎలాంటి విఘాతం రాదు అయినా మాటల్లో బహు జాగ్రత్తగా మసలుకోవలసిన అగత్యమున్నది వృత్తియందూ అలాంటి పరిస్థితే స్త్రీలకు ఆదాయమందు అబివృద్ధి, ఉద్యోగ ప్రగతికి ఆస్కారం

★ **వృశ్చికం** నిజమైన మిత్రులు దొరకటం దుర్లబం మీరు ఏదో యదాలాపంగా ఉన్న సమయంలో వారు అంటే పరిచితులు అపకారం చేయనున్నారు జాగ్రత్త దన వసతియందు మాత్రం పెద్దగా యిబ్బంది చెప్ప వీలులేదు కాన ఉత్సాహంగా ఉండటమే న్యాయం స్త్రీలకు అనుకొన్న విధాన అంతా సక్రమంగా జరిగిపోవటం గమనిస్తారు

★ **ధనుస్సు** ఎవరు కావలసిన వారో, ఎవరు మీ క్షేమాన్ని ఆకాంక్షిస్తారో తెలిసి మెలగటం ముఖ్యం మీ రాజకీయ పరిజ్ఞానం రాణింపునకు రాదు చేసిన పనినే మరలా ఈ వారం చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది స్త్రీలకు చేసిన యత్నాలు పలవంతమై ఉద్యోగం చిక్కే ఆస్కారమున్నది

★ **మకరం** . వారమంతా ఏదో పని వున్నట్లుగా, క్షణం తీరికలేకున్నట్లుగా ఉంటుంది నిజానికి చేయగలిగిందీ లేదు చేసిందీ లేదు ఉద్యోగ యత్నాలు ఫలించే అవకాశం కూడా లేకపోలేదు ప్రయత్నాలు చేయటమే మన వంతు పలితం దైవాధీనం స్త్రీలకు బంధువుల రాక పోకలు, మిత్ర గోష్టికి అవకాశం

★ **కుంభం** చాల దూర ప్రదేశాన్నుండి, బందుమిత్రులు యింటికి రానున్నారు మీ సలహాకై ఎదురు చూస్తారు మీరూ వారికి సహకరించటం ఎంతైనా న్యాయంగా బావించి సహకరించండి ఏదో విదంగా వారమంతా ఉత్సాహజనంగా సాగిపోతుంది స్త్రీలకు నూత్న వస్తు సేకరణకు అవకాశమున్నది

★ **మీనం** . రాజకీయంగా మీ యత్నాలు ఫలవంతం కాలేదని యిప్పుడు గ్రహింపగలుగుతారు ఒక సంవత్సరం క్రితం చేసిన వ్యవహారం బాగా బాదాకరం కావటం, తద్వారా యిబ్బందులకు గురి కావలసి రావడం యిప్పుడు గ్రహింపగులుగుతారు వ్యవహారం పరిష్కరించుకొనుటకు సర్వోత్తమ వారంగా గ్రహించండి స్త్రీలకు నగలో, వస్త్రాలో, తుదకు వాహనమో కొందరకు అమరవచ్చు, గ్రహించండి

—విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

# బ్లేజ్ ప్రస్తుతము ఇండియాకు అందిస్తున్నది విశ్వకోవకు చెందిన పరిమళాలను

ఇది ప్రపంచ విఖ్యాతి పొందినది
ఈ రహస్యము నాకే తెలుసు కదా.

దీప్తి నావల్






## క్రొత్త బ్లేజ్ పెర్ఫ్యూమ్స్

## సీయన్స్

సరిక్రొత్త బ్లేజ్ పరిమళాలు ఇదిగో ఇవే రెండు
ప్రపంచ కోవకు చెందిన సరిక్రొత్త పరిమళాలు
సీయన్స్ మరియు ట్రాన్స్ అందరికి అందుబా
టులోయుండే ధరకే లభిస్తాయి.

## ట్రాన్స్



# సీరియల్ మల్లిక

## యార్లగడ్డ కిమీర

(గత సంచిక తరువాయి)

ఆమెకు ముందే ఇద్దరు పేషెంట్లున్నారు గదిలో వాళ్ళ తర్వాత గాని తనని పిలవడు అనుకుంటూ పుస్తకం చేతిలోకి తీసుకుంది పేజీలు తిరగేస్తోందేగాని ఆమె మనసు పుస్తకంమీద లేదు

ఈ డాక్టర్ ఎలాంటివాడో? కాస్త శ్రద్ధగల మనిషైతే బాగుండును క్రితంసారి డాక్టర్‌ది ఒట్టి డల్‌ముఖం! అతని ముఖం చూస్తుంటేనే పేషెంటుకి ఎక్కడలేని నీర్సమూ వస్తుంది ఏదైనా టెస్ట్ చేసినప్పుడు దాని ఫలితం అతనే ఫోన్ చేసి చెబుతాడేమోనని ఎదురు చూసేది మల్లిక అతను ఫోన్ చేసేవాడు కాదు సరికదా నర్స్‌తోనన్నా చేయించేవాడు కాదు మళ్ళీ మల్లిక ఫోన్ చేసేవరకూ ఏ వార్తా వుండేది కాదు

అంతంత డబ్బు గుంజుతూ పర్సనల్ కేర్ తీసుకోని వీళ్ళ తీరు చూస్తుంటే ఆమెకు ఒళ్ళు మండుతుంది అందుకే ఈ డాక్టర్ దగ్గరకు రావటానికి చాలా రోజులు ఆలోచించింది మల్లిక

'మిసెస్ మల్లికారామ్? అన్న ప్రశ్న వినబడగానే అటు చూసింది

తెల్లటి కోటులో వున్న మనిషి నవ్వుతూ చెయ్యూపాడు వెంటనే లేచి నిలబడింది

'అయామ్ డాక్టర్ పియర్‌సన్ అంటూ కరచాలనం చేశాడతను

అతను దారితీసిన వైపు వెంటే లోపలికి వెళ్ళింది మల్లిక ఆఫీస్‌రూంలోకి రాగానే ఆమెకు కుర్చీ చూపించి, తన కుర్చీలో కూర్చున్నాడు డాక్టర్ పియర్‌సన్

ఆమె అంతకుముందు పూర్తిచేసిన అప్లికేషన్ వైపు, ఎదురుగావున్న ఫైలువైపు చూస్తూ రెండు నిముషాలు గడిపాడతను షుమారు నలభై ఏళ్ళ వయస్సుంటుందతనికి బట్టతల, కళ్ళద్దాలు, ముఖంలో వర్చస్సు, పెదవుల మీద ఎల్లప్పుడూ అంటిపెట్టుకుని వుండే మందహాసం– ఎందుకో మల్లికకు అతన్ని చూస్తుంటే మంచి అభిప్రాయం ఏర్పడింది

మీరు ఇండియన్ కదూ? ఆసక్తిగా అడిగాడు ఫైల్‌లో నుండి తలెత్తి

అవును అంది నవ్వుతూ వెంటనే మీరు బ్రిటిష్‌కదూ? అనడిగింది

అతను కొంచం ఆశ్చర్యపోయినట్లు కనిపించాడు అంతలోనే నవ్వుతూ, అవును నా యాక్సెంట్ నేనెక్కడున్నా పట్టి ఇస్తుంది అన్నాడు

నా చిన్నప్పుడు మా పేరెంట్స్ ఇండియాలో వుండేవారు మా ఫాదర్ అక్కడ ఆర్మీలో ఆఫీసర్! నా చిన్నతనమంతా అక్కడే గడిచింది మళ్ళీ అతనే అన్నాడు

అలాగా? లేని కుతూహలం మేళవించి అంది మల్లిక. చాలా సందర్భాలలో, చాలామంది ఒకప్పుడు ఇండియాలో వున్నామనో, చిన్నతనం అక్కడ గడిచిందనో, తమ బంధువులెవరో అక్కడ వుండేవాళ్ళనో చెప్పగా వినటం మల్లికకు పరిపాటే!

మల్లికా , అలా పిలవటం మీకేమి అభ్యంతరం లేదుకదా?' అంటూ ఆగాడు

లేదు నన్నందరూ అలాగే పిలుస్తారు

డాక్టర్ స్పాల్డింగ్ పంపిన ఫైలంతా చదివాను దాని ప్రకారం అన్ని పరీక్షలూ చేసినట్లు, మీలోనూ మీ భర్తలోనూ ఏ లోపమూ లేనట్లు తెలుస్తోంది దయచేసి మీకు చేసిన పరీక్షలేమిటో గుర్తుంటే చెప్పగలరా?

గుర్తుండక పోవటమా? నిద్రలో నుండి లేపినా ఠక్కున చెప్పగలను నిర్ధారణకోసం ఒక్కొక్క టెస్టూ రెండుసార్లు చేశాడు డాక్టర్ స్పాల్డింగ్! గబుక్కున అంది మల్లిక ఎండోమెట్రియల్ బయాప్సీ, రూబిన్ టెస్ట్, హిస్టరోసాల్పింగోగ్రామ్, లాపరోస్కోపీ, పోస్ట్‌కాయిటల్ టెస్ట్ ఫర్ స్పెర్మ్ మొటిలిటీ వగైరాలు ఇవిగాక, రోజూ వుదయమే పడక దిగకముందే బాడీ టెంపరేచర్ నోట్ చెయ్యటం నా రోజువారీ కార్యక్రమంలో మొట్టమొదటి ఘట్టం!

గుడ్! కరెక్ట్‌గా చెప్పారు ఈ పరీక్షలన్నిటి వల్ల మీ గర్భాశయం నార్మల్‌గా వుందని, హార్మోనుల వుత్పత్తి, అండోత్పత్తి ప్రతినెలా క్రమం తప్పకుండా జరుగుతోందని, ఫాలోపియన్ ట్యూబ్స్ సరిగ్గానే వున్నాయని తెలుస్తోంది మీ భర్త స్పెర్మ్ కౌంట్ కూడా సరిగ్గానే వుందని అతనికి చేసిన పరీక్షల్లో వుంది

సెకండ్ ఒపీనియన్ తీసుకోవాలనుకున్న మీ నిర్ణయం మంచిదే!ఎందుకంటే డాక్టర్లయినంత మాత్రాన కరెక్ట్‌గా రోగ నిర్ధారణ చేస్తారనుకోవటం ఎల్లవేళలా నిజంకాదు డాక్టర్ కూడా మనిషే కదా? మానవ సహజమైన పొరపాట్లు జరుగుతూనే వుంటాయి ఎంత సమర్థుడైన డాక్టరైనా ఎప్పుడో, ఏదో ఒక అంశం అతని దృష్టినుండి తప్పిపోవచ్చు అదెంత చిన్నదైనా డయాగ్నోసిస్‌కి అత్యంత ముఖ్యమైన దవ్వొచ్చు అందుకే ఒక్క డాక్టరు అభిప్రాయాన్నే పట్టుకుని వ్రేళ్ళాడక కనీసం ఇంకొక్కరితోనైనా సంప్రదించటం వివేకవంతమైన పని అందులోనూ సమస్య ముఖ్యమైన దైనప్పుడు!' ఆగి మల్లిక వంక చూశాడు డాక్టర్

దాదాపు రెండు సంవత్సరాల పరీక్షల తర్వాత అంతా నార్మల్‌గా వుందని, చెయ్యవలసిన వైద్యం ఏమీ లేదని చెప్పాడు డాక్టర్ స్పాల్డింగ్ ఆయన మాటలమీది భరోసాతో తర్వాత రెండు సంవత్సరాలనుండీ ప్రయత్నిస్తున్నా ఇంత వరకూ ప్రెగ్నెంట్ కాలేకపోయాను అంతా బాగానే వున్నప్పుడు ప్రెగ్నెంట్ అవ్వక పోవటమేమిటి? అందుకే మీ దగ్గరకు వచ్చాను

మీ డేటా ప్రకారం మొదట్లో రెండు సంవత్సరాలు కాంట్రాసెప్షన్ వాడారు తర్వాత పిల్లలకోసం ప్రయత్నిస్తూ, రెండు సంవత్సరాల వరకూ ప్రెగ్నెంట్ కాకపోవటంతో డాక్టర్ దగ్గరకు వెళ్ళారు అవునా?

అవును

అంతకంటే ముందే మీరు డాక్టర్ దగ్గరకు వెళ్ళుండ వలసింది లెక్క ప్రకారం ఆరోగ్యమైన జంట కలిసి కాపురం చేసినప్పుడు కనీసం ఆరు నెలల్లో ఆ స్త్రీ గర్భం ధరించగలిగి వుండాలి అలా జరగకపోతే ఏదో కారణం వుందన్నమాటే! మరొక ఆరు నెలలు కూడా ప్రయత్నించినా ప్రయోజనం లేకపోతే తప్పకుండా డాక్టర్ దగ్గరకు వెళ్ళాలి. ఏళ్ళు పైబడినకొద్దీ స్త్రీకి గర్భధారణశక్తి క్రమంగా సన్నగిల్లుతూ వస్తుంది అందుకే సాధ్యమైనంత తొందరగా డాక్టర్‌కి చూపించుకోవటం మంచిది ఇరవై ఏళ్ళ వయస్సులో వున్నప్పటి మీకు, ముప్పై ఏళ్ళు దాటిన ఇప్పటి మీకూ మిగతా మార్పులతో బాటు ఫర్టిలిటీలోనూ మార్పు వచ్చేవుండాలి కానీ అవకాశం లేదనటంలేదు నా ప్రయత్నం నేను తప్పక చేస్తాను. కాకపోతే మళ్ళీ అన్ని టెస్టులూ చెయ్యవలసి వుంటుంది ' ప్రశ్నార్థకంగా మల్లిక వంక చూశాడు డాక్టర్

"మళ్ళీ పరీక్షలు చెయ్యకుండా నా రికార్డు చూసి చెప్పలేరా?"

'ముందే చెప్పాను కదా, ఒక డాక్టరు చూసిన దృష్టితో ఇంకొక డాక్టరు

**జరిగిన కథ-2 :** భార్గవ్ అమెరికాలో ఒక చిన్న ప్రవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు భార్గవ్‌కు మల్లిక పరిచయం అయ్యింది ఆమె కంప్యూటర్‌లో డిగ్రీ తీసుకుని ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళి చేసుకున్నారు. భార్గవ్ మల్లికల జీవితం హాయిగా సాగిపోతోంది మల్లికకు జీవితంలో కోరుకున్నవన్నీ ఉన్నాయి. కాని మల్లిక డాక్టరు దగ్గరకి వెళ్ళింది

చూడక పోవచ్చుని? ఖచ్చితంగా నా ఒపీనియన్ కావాలంటే నేను స్వయంగా అన్ని పరీక్షలూ చెయ్యటం తప్ప మార్గంలేదు

నిట్టూర్చింది మల్లిక అటూ ఇటూగాని పరిస్థితి ఇది! ఆ బాదంతా ఎవరు పడతారులే అని ఒదిలెయ్యలేదు అలా అని ఆ తతంగాన్ని మళ్ళీ భరించనూలేదు ఈ డాక్టర్లంతా ఇంతే! కర్ర విరగా నివ్వరు పాముని చావానివ్వరు ఖచ్చితంగా ఏదీ చెప్పరు ఏ పరిస్థితుల్లో నైనాసరే అవకాశం వుందనే అంటారు రోగి మనస్సులోని ఆశను పూర్తిగా సమాది చెయ్యరు

విసుగువచ్చింది మల్లికకు లేచి నిల్చుంది సరే డాక్టర్! మా వారితో కూడా మాట్లాడి మీకేవిషయమూ చెబుతాను

డాక్టర్ కూడా లేచాడు అలా చెయ్యటం మంచిది కాని ఏ విషయమూ త్వరగా ఆలోచించుకోండి ఆమె వెళ్ళటానికి డోర్ తెరిచాడు

★ ★ ★ ★ ★ ★

సబ్‌వేలో కూర్చున్న మల్లిక మనస్సు చికాగ్గా వుంది ఈ డాక్టర్ తెలియని ప్రశ్నలకు జవాబులు చెబుతాడేమోనని ఆశపడింది కాని విషయం మళ్లీ మొదటికే వచ్చింది నాలుగేళ్ళ క్రిందట పరిస్థితే మళ్ళీ ఇప్పుడు అన్ని టెస్టులూ చెయ్యాలట!

మిగతావన్నీ పరవాలేదుగాని ఆ లాపరోస్కోపీని తలుచుకుంటేనే ప్రాణం పోతున్నట్టుగా వుంది

ఆ రోజు

అంతకు ముందు రోజే లాపరోస్కోపీ ఎలా చేస్తారో అంతా వివరించాడు డాక్టర్ స్పాల్డింగ్ జనరల్ అనెస్తీషియా ఇచ్చి బొడ్డు ద్వారా సన్నటి ట్యూబ్‌ని లోపలికి పంపి టెలిస్కోప్ ద్వారా లోపలి బాగాల్ని పరీక్ష చేస్తాంని చెప్పాడు ప్రొద్దున్నే హాస్పటల్‌కి వస్తే మధ్యాన్నానికల్లా ఇంటికెళ్ళి పోగలిగితే సింపిల్ ఆపరేషన్ అని కూడా చెప్పాడు

ఆపరేషన్ స్కెడ్యూల్ చేసిన రోజుకి సరిగ్గా రెండవరోజే భార్గవ్ ఏదో వర్క్ షాప్ అటెండ్ అవ్వవలసి వుంది అది ఎప్పుడో నిశ్చయమ్మైన ప్రయాణం! ఆ వర్క్‌షాప్ అటెండ్ అయితే భార్గవ్‌కి జాబ్‌లో ప్రమోషనొచ్చే అవకాశముంది అది భార్గవ్ వుద్యోగం మొత్తంలో ముఖ్యమ్మైన మలుపు!



# మల్లిక

అంతకు ముందు చూడని వూరు వెళితే తప్పకుండా మల్లికను కూడా తీసుకెళ్ళేవాడు భార్గవ్ మల్లిక ప్రయాణం చెయ్యొచ్చని డాక్టర్ చెప్పటంతో ఆమె కూడా వెళ్ళే నిర్ణయమైంది

ఆపరేషన్ రోజున ఎనిమిదిన్నర గంటలకల్లా మల్లికను హాస్పటల్‌కి తీసుకెళ్ళాడు భార్గవ్ మల్లికను నర్సరీలోకి పంపి అతను వెయిటింగ్ రూంలో కూర్చున్నాడు

మల్లికకు హాస్పటల్ గౌను, పేపర్ చెప్పులువేసి రక్తం యూరిన్ బాడీ టెంపరేచర్ బ్లడ్ ప్రెషర్, హార్ట్‌బీట్ మొదలైనవి పరీక్షచేసి స్ట్రెచర్‌లో ఆపరేషన్ రూంలోకి తీసుకెళ్ళేసరికి పదయ్యింది

ఆపరేషన్ రూంలో నర్సులు మల్లికను స్ట్రెచర్‌మీదనుండి ఆపరేషన్ టెబుల్‌మీదకు మార్చారు

ఎనస్తీషియాల జిస్ట్ నవ్వుతూ దగ్గరకు వచ్చాడు అతను చైనా దేశీయుడని అతని కనుముక్కు తీరు చెప్పక చెబుతోంది

హాయ్! నా పేరు డాక్టర్ చంగ్ నీ కిప్పుడు జనరల్ ఎనెస్తీషియా ఇవ్వబోతున్నాను అది ఇవ్వగానే గాఢ నిద్ర పట్టినట్లుంటుంది శరీరం మొద్దు బారుతుంది ఏం జరిగేదీ నీకు తెలియదు మరేం గాబరాలేదు నేను దగ్గరేవుండి మానిటర్ చేస్తుంటాను ఏదీ నీ చెయ్యి ఇలాఇవ్వు

మల్లిక మౌనంగా చెయ్యి జాపింది డాక్టర్ చంగ్ సిరంజి తీసి నీడిల్ చేతిమీద గుచ్చాడు

ఎనెస్తీషియా నీకు ఫస్ట్‌టైం అనుకుంటాను కొన్ని క్షణాల్లోనే నిద్ర పట్టేస్తుంది నంబర్సు చివరినుండీ చదవగలవా?

తలూపింది మల్లిక

వంద, తొంభైతొమ్మిది, తొంభైఎనిమిది, తొంభైఏడు, తొంభైఆరు

మల్లిక తల అతి తేలిగ్గా అవ్వసాగింది కనురెప్పలు వాటంతటవే మూసుకుపోతున్నాయి శరీరం గాలిలో తేలుతున్నట్లుంది చచ్చిపోవటం అంటే ఇదేనా? మనుషులు నిర్వచించలేని చావురూపం ఇదేనా?

మల్లికకు పూర్తిగా స్పృహ పోకముందటి ఆఖరి ఆలోచన అదే!

మల్లిక మళ్ళీ స్పృహలోకి వచ్చేసరికి కలలోనో, మరేలోకంలోనో ఎవరో మాట్లాడుతున్నట్లు అస్పష్టంగా మాటలు వినిపించసాగాయి తను చచ్చిపోయి ఇంకోలోకం వచ్చిందా? ఇది నరకమో, స్వర్గమో? ఈలోకం ఎలా వుంటుందో? ఇక్కడ అమ్మనీ, నాన్ననీ, అమ్మమ్మనీ మళ్ళీ చూడవచ్చేమో! బలవంతంగా కళ్ళువిప్పింది

పైనుండి క్రిందవరకూ తెల్లటి బట్టలేసుకున్న మనుషులు హడావిడిగా తిరుగుతున్నారు వీళ్ళు దేవదూతలేమో! రాక్షసుల్లా మాత్రం లేరు కాబట్టి స్వర్గమే అయ్యుండాలి

తల తిప్పి చూసింది అటూ ఇటూ మంచాలమీద తనలాగే ఎవరో పడుకుని వున్నారు వాళ్ళు తనలాగే చచ్చిపోయి వచ్చిన వాళ్ళా?

అప్పటివరకూ అస్పష్టంగా కనబడిన రూపాలు ఇప్పుడు కాస్త స్పష్టంగా కనబడసాగినయి మల్లిక కళ్ళు తెరవటం చూసి ఒక తెల్లటిబట్టల మనిషి ఇటు వచ్చింది

నవ్వుతూ మల్లికవంక చూసింది. 'ఎలా వుంది? పూర్తిగా స్పృహ వచ్చిందా? ఏమైనా బాధగా వుందా?

'నేనెక్కడున్నాను? నీర్సంగా అడిగింది మల్లిక గొంతు బొంగురుగా వుంది నూతిలోంచి మాట్లాడినట్లుంది ఆమెకే

"రికవరీ రూంలో! నేనిక్కడి నర్సుని నీకింతకుముందే ల్యాపరోస్కోపీ జరిగింది. కాస్సేపట్లో డాక్టర్ స్పాల్డింగ్ వచ్చి మాట్లాడతారు ' అని బ్లడ్‌ప్రెషర్ , పల్స్ చెక్‌చేసి వెళ్ళిపోయింది

పది నిముషాల తర్వాత డా స్పాల్డింగ్ వచ్చాడు అప్పటికి మల్లికకు చాలావరకు మత్తు ఒదిలిపోయింది

డాక్టర్ ముఖంలోకి చూసింది మల్లిక అతని ముఖం ఎప్పటిలాగే సీరియస్‌గా, బహుడల్‌గా వుంది ఇప్పుడైనా కాస్త నవ్వకూడదూ? ఆ ముఖం చూస్తేనే లేని రోగాలు పట్టుకుంటాయి బొత్తిగా ఈ డాక్టర్‌కి బెడ్‌సైడ్ మేనర్స్ తెలియవు అనుకుంది

మిసెస్ రామ్! ఆపరేషన్ సక్సెస్‌ఫుల్‌గా జరిగింది లోపల అన్నీ నార్మల్‌గా వున్నాయి ఇప్పుడే మీ హస్బెండ్‌తో మాట్లాడి వస్తున్నాను ఇంకొక గంట రెస్ట్‌తీసుకుని ఇంటికెళ్ళిపోవచ్చు

థాంక్యూ డాక్టర్! మనస్సులోని బరువు ఎవరో తీసేసినట్లయ్యింది

డాక్టర్ ప్రక్కబెడ్ మీది పేషెంట్ దగ్గరకు వెళ్ళాడు నర్స్ వచ్చింది మళ్ళీ బ్లడ్‌ప్రషర్, పల్స్ చూసింది

బ్లడ్‌ప్రషర్ నార్మల్‌కి వచ్చేసింది ఇక నువ్వు లేచి కుర్చీలో కూర్చోవచ్చు లేవగలవా?

లేవగలనన్నట్లు తలూపింది మల్లిక

నర్స్ సాయంతో బెడ్ మీదనుండి లేచి ప్రక్కరూంలో వున్న ఈజీఛైర్లో కూర్చుంది

తాగటానికేమైనా ఇవ్వనా? టీ, కాఫీ, జ్యూస్?

చాలా నీర్సంగా వుంది మల్లికకు రాత్రి డిన్నర్ తర్వాత డాక్టర్ చెప్పినట్లుగా పచ్చి మంచినీళ్ళు కూడా తాగలేదింతవరకూ

కాఫీ కావాలి

గదిలో ఒక మూలగావున్న టేబుల్ మీది పర్క్యులేటర్‌లో నుండి కాఫీ కప్పులో పోసి షుగర్, క్రీమ్ కూడా వెయ్యాలా? అనడిగింది నర్స్

ఎస్ ప్లీజ్!

కాఫీ తెచ్చిచ్చింది నర్స్

టైమెంతయ్యింది? కప్పందుకుంటూ అడిగింది మల్లిక

పన్నెండు

కాఫీ తాగటం పూర్తయ్యేసరికి కాస్త సత్తువ వచ్చింది మత్తు పూర్తిగా దిగిపోయింది మత్తుపోవటంతో బొడ్డుదగ్గర సన్నగా నొప్పి మొదలయ్యింది చేత్తో తడిమి చూసుకుంది బొడ్డుదగ్గర అరచేతి మందాన దూది ప్లాస్టర్‌తో అంటించి వుంది

నొప్పి అంతకంతకూ ఎక్కువవ్వసాగింది దానికితోడు కుడిభుజం ఏదో భయంకరమైన జంతువు నోట్లో పెట్టుకుని నములుతున్నట్లు భరించలేని పోటుగా వుంది గొంతుకూడా మింగుడు పడకుండా నొప్పిగావుంది

అటువైపుగా వెళ్తున్న నర్సుని సైగజేసి పిల్చింది 'ఏం కావాలి? అడిగింది నర్స్

తన పరిస్థితి వివరించింది మల్లిక

అదా! మరేం ఫరవాలేదు బొడ్డు దగ్గర రెండు మూడు కుట్లు వేశారు కదా? అందువల్లనే బొడ్డు దగ్గర నొప్పి లోపలికి పంపిన గ్యాస్ కొంత డయాఫ్రమ్‌లో చేరటం వల్ల భుజం నొప్పి పెడుతుంది ఆపరేషన్ తర్వాత ఇదంతా సహజమే! ఒకటి రెండు రోజుల్లో అదంతా తగ్గిపోతుంది ఈలోపల నొప్పికి డాక్టర్ బిళ్ళలు వ్రాసిచ్చారు అది వేసుకుంటే బాధ తెలియదు అని ప్రిస్క్రిప్షన్ చేతిలో పెట్టింది డైట్ కూడా లైట్‌గా టోస్ట్, సూప్ జ్యూస్ మొదలైనవి తీసుకోవాలని చెప్పింది

ఆ తర్వాత అరగంటకి మల్లికను డిశ్చార్జ్ చేశారు అది నడివేసవి అవ్వటంతో ఎండలు మండిపోతున్నాయి కార్లో ఎయిర్‌కండిషనింగ్ లేకపోవటంతో ఆ ఎండవేడికి ఆరాటం మొదలై వున్న బాధ పదిరెట్లయినట్లయింది మల్లికకు ఎలాగోలా ఇల్లు చేరేసరికి రెండు దాటింది

ఆ సాయంత్రం ఆరు గంటలకే వాళ్ళెళ్ళవల్సిన ఫ్లైట్!

ఎయిర్‌పోర్ట్ చేరుకోవటానికి గంట టైం పడుతుంది

అంటే ఇంకొక రెండు మూడు గంటల్లో బైలుదేరాలి

# నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.




## బెణుకులు, కండరాల పట్లు, కీళ్ల పట్లు, ఒళ్లు నొప్పులకు.

ELL 1508

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి–ఇవే మీ కుటుంబానికి కావలసినవి అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి ఎందుకంటే, అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయంచేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరివున్నాయి

**అయొడెక్స్ రోజుకు రెండు సార్లు రెండింతలు గుణకారి**

నొప్పి తగ్గే వరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండు సార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువులకైన గాయం

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్లపట్లు, లేదా ఒళ్లు నొప్పులతో బాధపడడం జరిగితే అయొడెక్స్ మర్దించండి రోజుకు రెండు సార్లు తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు

SKF – ఎస్‌కెఎఫ్ ఉత్పాదన

**అయొడెక్స్®– నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.**

## బయోగ్యాస్ పరిచయం-3

ఉండలుగా నున్న ఏనుగు విసర్జన పదార్థాలు



# బయోగ్యాస్-
# ఇతర పదార్థాల ఉపయోగం

మొట్ట మొదట ప్రయోగాలు మొదలుకొని ఇప్పుడు పని చేస్తున్న కుటుంబ సైజు ప్లాంటుల వరకు ఉపయోగించేది కేవలం పేడ కావడంవల్ల "గోబర్ గ్యాస్ ప్లాంట్" అనే పేరు వాడుకలో చలామణి అవుతుంది కాని నిజానికి ప్రతి కుళ్ళిపోయే లక్షణమున్న కర్బన పదార్థాల నుండి అవాయు ప్రక్రియ ద్వారా మండే గుణం గల వాయువును పొందవచ్చు మనిషి ఏనుగులు గుర్రాలు పందులు కోళ్ళు మేకలు గొర్రెల విసర్జన పదార్థాలే కాక కలుపు మొక్కలు (బుడగ తామర పార్థీనియమ్) అరటి తొక్కలు నాచు ఆముదపు పిప్పి చిత్తు కాగితాలు వ్యవసాయ మరియు వంట ఇంటి వ్యర్థ పదార్థాలు చక్కెర ఫ్యాక్టరీలనుండి వెలువడే పదార్థాలు మొదలగు అనేక పదార్థాల నుండి గ్యాస్‌ను జనింప జేయవచ్చు. అందుకే ఇన్ని రకాల జీవరాశి నుండి వెలువడే గ్యాసును గోబర్ గ్యాస్‌గా కాకుండా బయోగ్యాస్ అని పిలువడం ఎంతైనా సమంజసంగా అర్థవంతంగా తోస్తుంది ఈమధ్య ఈ పేరే ఎక్కువగా వాడుకలోకి వస్తుంది

సూక్ష్మజీవులు బయోగ్యాస్‌ను తయారు చేయడానికి కొన్ని అనుకూల పరిస్థితులు కావాలి అవి–అవాయు పరిస్థితి ఉష్ణోగ్రత (37 డిగ్రీల సెంటిగ్రేడు) పి హెచ్ (ఆమ్ల క్షారాలను ఎ హెచ్ లో లెక్కిస్తారు) )70–75) కర్బన నత్రజని నిష్పత్తి (30 1) మరియు ఘన పదార్థాల శాతం (9–12) మొదలగునవి

బయోగాస్ సాంకేతిక విజ్ఞానం ఎన్నో సమస్యలకు ఉత్తమ పరిష్కార మార్గం మన దేశంలో దీన్ని ఇంధనం మరియు ఎరువులనిచ్చే ప్లాంటుగా ఎక్కువ మంది భావిస్తారు ఈ రెంటిలో కూడ కొందరు ఇంధనం విషయాలకి మొగ్గుచూపుతె మరికొందరు ఎరువు నిచ్చే ప్లాంటుగా చూస్తారు చైనాలో దీన్ని అత్యుత్తమ ఎరునిచ్చే సాధనంగా భావిస్తారు మాయా ఫార్మ్ (ఫిలిప్పైన్స్) ఈ టెక్నాలజీని కాలుష్య నివారణో పాయంగా ఉపయోగించుకుంటుంది అక్కడ ప్రతి దినం పెద్ద మొత్తంలో పందుల మల విసర్జన పదార్థాలు పరిసరాల్ని అసహ్యంగా తయారు చేసేవి. ఇపుడు బయోగాస్ విజ్ఞానంవల్ల ఆ ఫార్మ్‌కు ఇంధనం, విద్యుచ్ఛక్తి మరియు ఎరువు లభిస్తుంది. పరిసరాల శుభ్రతను పెంపొందించడమే కాక వ్యాధుల వ్యాప్తిని అరికట్టడంలో కూడ ఈ టెక్నాలజీ ఎంతో తోడ్పడుతుంది మానవ మల విసర్జన పదార్థాల్లో చాల వ్యాధి జనకాలు ఉంటాయి. మనం నివసించే ప్రదేశాల్లో ముఖ్యంగా గ్రామాల్లో చిక్కు సమస్యలను తెచ్చిపెడతాయి ఇక్కడ కూడ బయోగాస్ టెక్నాలజీని ఉపయోగించుకొని పరిసరాలను మెరుగు పరచి ఇంధనం మరియు ఎరువును పొందవచ్చు వ్యాధి జనకాలు బయోగ్యాస్ ప్లాంటు ద్వారా ప్రవేశ పెట్టినప్పుడు చాలావరకు నశించి పోతాయి ఈవిధంగా బయోగ్యాస్ ప్లాంటు స్వచ్ఛమైన వాయు ఇంధనం మేలైన ఎరువు, కాలుష్య నివారణకారిగా పరిసరాల శుభ్రతను పెంచే సాధనంగా రైత ఇంట్లో పల్లె జీవితంలో ఫార్మ్‌లలో మరియు కర్మాగారాలలో ఒకవరమై నిలచిపోయింది

తమ విసర్జన పదార్థాలతో పరిసరాలను పాడుచేస్తున్న ఏనుగులు



# హీరో

మలం- మూత్రం
తొక్కలు- పేడా
కుళ్ళిపోయే జీవరాశి
ఏదైతేనేం!
కంపువాటినన్నింటిని
సొంపు పదార్థాలుగా
మారుస్తుంది
మన బయోగ్యాస్ ప్లాంట్!



ఏనుగు విసర్జన పదార్థాల నుపయోగించడానికి నిర్మించిన పెద్ద బయోగ్యాస్ ప్లాంట్

త్రిచూరు (కేరళా)కు దగ్గరలోనున్న గురువయూరులోని శ్రీకృష్ణదేవాలయానికి గల ఆస్థలో 38 ఏనుగులున్నాయి ఒక్కొక్క ఏనుగు ప్రతి రోజు 50–80 కిలో గ్రాముల విసర్జన పదార్థాలను వదలడంతో టన్నులకొద్దీ పోగయ్యేవి ఇవి ఎండిన తరువాత కాల్చి బూడిదను కొబ్బరిచెట్లకు ఉపయోగించేవారు ఈ పద్దతులకు స్వస్తి చెప్పి కొత్త రీతిలో ఉపయోగించుకోడానికి గాను ఒక పెద్ద బయోగ్యాస్ ప్లాంటు నిర్మాణం జరిగింది దీంట్లో ఏనుగుల విసర్జన పదార్థాల నుపయోగించి వచ్చే గ్యాసును 19 కుటుంబాలకు వంట కొరకు ఉపయోగించడానికి కనెక్షన్లు ఇచ్చారు ఎరువును దేవాలయపు వ్యవసాయ క్షేత్రాలకు వాడతారు

లక్నో (ఉత్తరప్రదేశ్)లో పోలీస్‌లైన్స్‌లో 32 గుర్రాలున్నాయి వీటి విసర్జన పదార్థాలతో ఏగడం సమస్య కావడంవల్ల ఒక పెద్ద బయో గ్యాస్ ప్లాంటును నిర్మించారు వచ్చే గ్యాస్‌తో 80 మందికి సరిపోయే వంటకాలను తయారు చేస్తున్నారు దీనివల్ల ప్రతి రోజు కట్టెలు కాల్చే పని తప్పింది ఫలితంగా నెలకు 2500 రూపాయలు ఆదా అయినట్లు అంచనా!

పాట్నా (బీహారు)లో పూర్తిగా కమ్యూనిటి లాట్రీన్ లపై ఆధారపడి పని చేసే బయో గ్యాస్ ప్లాంటుంది దీనిని సులభ ఇంటర్నేషనల్ అనేసేవా సంస్థ నిర్మించింది వెలువడే గ్యాసు నుండి విద్యుచ్ఛక్తిని జనింపజేసి వీధిస్తంబాలద్వారా వెలుతురుకు ఉపయోగిస్తున్నారు ఈమద్య గుజరాత్ మరియు మహారాష్ట్రాలలో ఎక్కువమంది తమ బయోగ్యాస్ ప్లాంట్లకు లేట్రీన్ రూమ్‌లను కలుపుకుంటున్నారు దీనివల్ల ఎక్కువ గ్యాసే కాక ఎరువు లక్షణం మెరుగవుతుంది

ఓఖ్లా (ఢిల్లీ) వేస్ట్ వాటర్ ట్రీట్‌మెంట్ ప్లాంటు మామూలుగా మన నిత్య జీవిత కార్యక్రమాలలో వెలువడే వ్యర్థ పదార్థాల నుండి బయో గ్యాస్ జనింపజేసి 1500 ఇళ్ళకు వంట కొరకు సరఫరా చేస్తున్నారు

ఇంతే కాక కోళ్ళ రెట్టలను గొర్రెల మేకల మరియు ఒంటెల విసర్జన పదార్థాలనుపయోగించే ప్లాంట్లు కూడ ఉన్నాయి

బుడుగ తామర (గుర్రపు డెక్క) మహా చెడ్డ నీటి కలుపు మొక్కగా చాలా దేశాల్లో ప్రాకిపోయిన విషయం తెలుసు గోరఖ్‌పూర్ (ఉత్తరప్రదేశ్)లో కేవలం బుడుగ తామరను ఉపయోగించే ప్లాంటొకటి నిర్మాణంలో ఉంది మన రాష్ట్రంలో కూడ ఇలాటి ప్లాంటునొకదాని నిర్మిస్తున్నారని తెలిసింది

ఈ విధంగా ఏళ్ళ తరబడి ఎదుర్కొంటున్న సమస్యలను పటాలున పరిష్కరిస్తుంది మన బయోగ్యాస్ ప్లాంట్

**—వ్యాసం, ఫోటోలు టి సంపత్ కుమార్**

**(సైవారం బయోగ్యాస్- ఆర్థిక సహాయం)**

ఏపుగా పెరిగిపోయిన బుడగ తామర



లేట్రీన్‌కు కలుపబడ్డ బయోగ్యాస్ ప్లాంట్



# ఆటుపోటులు

మంతెన సూర్యనారాయణ రాజు

మాగన్నుగా రెప్పవాల్చి నిద్రపోతున్నాడు సుబ్బారాయుడు అదే సమయంలో పోస్టుమేన్ వచ్చి పోస్ట్ అని పిలవడంతో మెలకువ వచ్చేసింది అదరాబాదరా లేచి వెళ్ళి మనియార్డరేనా అన్నాడు ఆబగా

కాదండి మామూలు ఉత్తరమేనండి అంటూ అది యిచ్చి వెళ్ళిపోయాడు పోస్ట్‌మేన్

అది చదివి మంచంమీద నీరసంగా కూలబడుతూ భగవంతుడా! ఈ నెలా అబ్బాయిని తొందరగా డబ్బు పంపలేని అసమర్థుణ్ణి చేసావా అనుకుంటూ పరుపుక్రింద ఉత్తరం భద్రపరిచి మళ్ళీ నిద్రపోవడానికి ప్రయత్నించాడు దాని సికదరగ నిద్ర దరిజేరితేగదా! ఆ ఉత్తరం చదివాక నిద్ర మరి రాదని అతనికి తెలుసు.

కామాక్షి అక్కడికి వస్తూ ఎక్కణ్ణుంచండీ! అబ్బాయి డబ్బేమైనా పంపాడా! అని భర్తను నిలదీసింది సుబ్బారాయుడు తేలిగ్గా నవ్వేస్తూ. మనకి అవసరంగా ఉందని వాడికి మాత్రం సంతోషించు మొక్క మొలుస్తుందని విత్తు వేస్తాం! దాని ఫలితం పొందడానికి అదృష్టం కావాలి అన్నాడు శూన్యంలోకి చూస్తూ

నన్ను వెళ్ళి నాలుగు దులుపులు దులిపేసి రమ్మంటారేమిటి?

వద్దు ఆ పనిమాత్రం చేయకు మనకుమాత్రం ఉన్న దెంతమంది పిల్లలు చెప్పు వాడొక్కగా నొక్కడేగదా! ఏం ఇబ్బందు లొచ్చాయో ఏమో! అంటూ నీళ్ళు నమిలాడు

మీ దగ్గరున్న ఆ మెత్తని గుణమే మిమ్మల్ని అన్ని విధాలా అశక్తుడుగా చేస్తోంది లేకపోతే ఏమిటి చెప్పండి నెలకు వెయ్యి రూపాయలు సంపాదిస్తున్నాడు కనీసం పిల్లా పీచైనా బయల్దేరలేదు నెలకు రెండు వందల రూపాయలు పంపడానికి ఇబ్బందేమిటండీ!

నువ్వామాట అనుకుంటావని వాడికి మాత్రం తెలీదంటావా! కానీ కట్నం తీసుకోకుండా పరకట్నం పరాధారపడని వాడిని తన మూలంగా ఎవరు ఐతే శోకాలూ, రాగాలూ తీస్తూ కూచుంటావు వారం రోజుల్లో పంపుతానన్నాడుగా కాస్త ఓపిక పట్టు అన్నాడు

సరే! మధ్య నాదేం పోయింది రేప్రొద్దున్న పాలవాడికేం సమాధానం చెప్పి పంపిస్తారో చెప్పండి ఏమ్మాట్లాడినా నాదే తొందరంటూ వాణ్ని వెనకేసు కొస్తారు అంటూ లోనికి చక్కాపోయింది

* * * * * *

తెల్లవారి పాలవాడు రావడమేమిటి, పాలు పోసి డబ్బుకోసం పేచీ పెట్టాడు సుబ్బారాయుడు రెండు రోజులు ఆగునాయనా! దయచేసి అల్లరి పెట్టకు అంటూ వాణ్ణి బ్రతిమాల జూచాడు అతగాడు నిర్మోహమాటంగా రేపట్నుంచి పాలు పొయ్యడం నా వల్లకాదు అని వెళ్ళిపోతూంటే కామాక్షి అక్కడి కొస్తూ, నాయనా! నా ముఖం చూసి తెచ్చిపెట్టు నీకు డబ్బు లివ్వడం ఎప్పుడన్నా ఎగ్గొట్టామా చెప్పు మా ఎల్లాడికి జీతం రావడం ఈ నెల తెలుసేమిటీ? వారం రోజుల్లో పంపుతానని ఉత్తరం మాత్రం వ్రాసాడు అన్నాడు

ఆదేమిటండీ! మరైతే ఈ వారం రోజులు గడవడం మాట ఆలోచించేరా అంది

అంతా ఆ ఏడుకొండల వాడిదయ నారు పోసిన హేడు నీరు పొయ్యడంటావా! చెప్పు కానియ్! ఎలా జరగాల్సి వుందో అలా జరుగుతుంది

బాగుందండీ! మీ వరస వాడు చదువుకున్నప్పుడు ఎప్పుడు డబ్బు కావలిస్తే అప్పుడు వాడెక్కడ ఇబ్బంది పడతాడోనని నానా హైరానాపడి డబ్బు పంపేవారే మరి వాడామాత్రం తలిదండ్రుల ఇబ్బంది గమనించలేని ఆశక్తుడయ్యాడంటారా? అని ప్రశ్నించింది

కామాక్షీ! నీ కేమన్నా పిచ్చా, వెర్రా! అడ్డాలనాడు బిడ్డలుగాని, గడ్డాలొచ్చాకా, ఓ పిల్లని ఇంటి కోడలుగా తెచ్చుకున్నాక వాడు మన బిడ్డేమిటి? కాలం మారిపోయింది వాడి దయాదాక్షిణ్యాలతో మన శేష జీవితం వెళ్ళబుచ్చాలి అదృష్టవశాత్తూ పెన్షన్ పేరుతో ఆ రెండొందలన్నా వస్తున్నందుకైనా కాకూడదని తెలిసింటపిల్లను ప్రేమించి చేసుకున్నాడుగా! అందుకని అన్నీ అమర్చుకోవాలిగా ఈ నెలా ఏదో క్రొత్త సరుకు కొనుంటాడు లెద్దూ అన్నాడు

ఏడిచి మొహం కడుక్కున్నట్టుందండీ మన వరస ప్రతీ దానికీ వాణ్ణి వెనకేసుకు రాబట్టే వాడిష్టమొచ్చినప్పుడు పాతికో ఏభైయ్యో తగ్గించి డబ్బు పంపిస్తున్నాడు బాధను దిగమింగుకుంటూ రోజులు గడుపుకోవడం మీ కలవాటై పోయింది రాత్రి నేను బయలుదేరి వెళ్తున్నాను అంది కామాక్షి

వెళ్తున్నా నంటున్నావు బస్సు ఖర్చులకు డబ్బెక్కడిదే అని అడిగాడు సుబ్బారాయుడు

ఔనండోయ్! ఆ మాటా నిజమేననుకోండి! అంటూ ఏదో చెప్పబోయింది

అందుకే ఓసి వెర్రి మొగమా! ప్రతిదానికీ తొందర పనికి రాదంటాను నువ్వు వెళ్తావు వాడిని నానా మాటలూ అంటావు వాడు చిన్నబుచ్చుకుంటాడు ఆటుపై మన గడప తొక్కడం మానేసాడంటే దాంతో కాస్తంత ఆలస్యమైంది గాబోలు డబ్బు ఇంకా పంపించలేదు అంది భర్త వైపు కొరకొరా చూస్తూ

అమ్మగారూ! అయ్యగారి మాట సెప్పటం ఇదే మొదటిసారి కాదండి సానా మాట్లు సెప్పారు డబ్బులు అసలివ్వరని కాదు నేను గొడ్లకి ఉలవలు, తెలగపిండీ చిట్టూ తవుడూ కొనాలా అమ్మా! మా బాద మీకేం తెలుస్తుందమ్మా! ఈసారికి మీ మాటమీద పట్టుకొస్తాను ఇంకోసారి మాత్రం ఆలీశం సేత్తే మరో కాతా సూసుకోండి అని చెప్పి మరీ వెళ్ళిపోయాడు

సుబ్బారాయుడు బారంగా నిట్టూరుస్తూ ఏమి జీవితాలే మనవి కన్నవాళ్ళూ చూడక ప్రభుత్వమిచ్చే పెన్షనూ ఓ ప్రక్కకురాక ఎంతకాలమిలా ఇబ్బంది పడాలో కామాక్షీ వాడితో ఇంటి సంగతు లెందుకు చెబుతావు వాడేమన్నా మన బాదలు తీర్చేవాడా! పెట్టేవాడా? అన్నాడు

ఆఁ! ఉన్న ఇబ్బంది చెబితే ఎంతటి కర్కోటకుడైనా కరగక మానడు అడిగితేగాని అమ్మైనా పెట్టదంటారు వినలేదా! ఇదిగో

నిర్మోహమాటంగా చెప్పేస్తున్నాను నేనీ రాత్రికే అబ్బాయి దగ్గరికి బయలుదేరు తున్నాను కోడలుండగానే అన్ని విషయాలూ తేల్చి పారేస్తాను లేదా మేమింక నీకు లేమనుకో అని చెప్పి చక్కా వచ్చేస్తా! అటుపై ఉన్న కొంప అమ్మేసి ఆ డబ్బు వడ్డీ కేసుకుని అద్దె కొంపలో కాలక్షేపం చేస్తూ ఆ వడ్డీ డబ్బులే వాడుకోవడం మంచిదనిపిస్తూంది అంతేగాని ప్రతినెలా వాడిని దేవిరించడం దేనికి మీరు మాత్రం నా దారికి అడ్డురాకండి అంటూ భర్త సమాధానం కోసమైనా ఎదురు చూడకుండా లోనికెళ్ళిపోయింది సుబ్బారాయుడు నిట్టూర్చడం తప్ప మారు మాటాడలేదు

* * * * * *

ఉదయం ఏడు గంటలవేళ తలుపుచప్పుడైతే వంట చేసుగుంటున్న సుబ్బారాయుడు లేచి వెళ్ళి తలుపులు తీసాడు సరళని చూసి నిర్ఘాంతపోయాడు ఆమె మావగార్కి నమస్కరిస్తూ అత్తయ్య లేరా మావగారూ? అంటూ ప్రశ్నించింది అతనికి ఏమి సమాధానం చెప్పాలో, ఎలా చెప్పాలో పాలిపోలేదు ఈలోగా తాను తెచ్చిన సంచుల్లో గల పప్పులు, హార్లిక్సుసీసా ద్రాక్షపళ్ళు, తుషార్ వంటనూనె డబ్బా అన్నీ అక్కడ పెట్టి, పర్సు తీసి మావగారికి రెండు వందల రూపాయలు ఇస్తూ ఏమీ అనుకోకండి మావగారూ! రెండు నెలల్నుంచి జీతాలు సరిగా రావడం లేదు నిన్ననే ఇచ్చారు రెండు నెలల జీతం అంది

డబ్బందుకున్న సుబ్బారాయుడి నేత్రాలు సజలాలయ్యాయి రామ్మా! ఇలా కూర్చో' అంటూ మూలనున్న కుర్చీ ఆమె దగ్గరకు లాగాడు సరళ ఇంట్లోకి వెళ్ళి తిరిగి వస్తూ ముక్కెగరేస్తూ మామయ్యగారూ! అత్తయ్యెక్కడికెళ్ళారు స్టౌమీద పప్పు మాడు వాసనొస్తూంది దింపాలేండి అంది ఆమెకు ఏమని సమాధానం చెప్పాలి మీ అత్తయ్య మీ ఆయనకూ నీకూ బుద్ధి చెప్పడానికి వెళ్ళిందని చెప్పాలా! చుట్టాలింటి కెళ్ళిందని అబద్ధమాడాలా?అనుకుంటూ సందిగ్ధావస్థలో పడ్డాడు ఆమె మామగారివైపు చూస్తూ, అత్తయ్య నేమన్నా తిడితే పుట్టింటికిగాని వెళ్ళి పోయారాండి అంది. సుబ్బారాయుడు గుటకలు మింగుతూ 'అహ!అటువంటిదేమీ లేదమ్మా! అన్నగారి కూతురు పెద్దమనిషయ్యిందని తెలిసి ఆ మాట పూర్తికాకుండానే కామాక్షి లోనికి చక్కా వచ్చింది వెంటనే గుక్కతిప్పుకుని అదిగో మాటలోనే వచ్చేసింది అన్నాడు

కామాక్షి గొంతులో పచ్చి వెలక్కాయి అడ్డుపడ్డట్టయ్యింది

ఏమ్మా! ఎంతసేపైయ్యింది,వొచ్చి' అంది

ఇంతక్రితమే అత్తయ్యా! మీరు మీ అన్నగారింటి కెళ్ళారని మావగారిప్పుడే అంటున్నారు మరి నేను వెళ్ళొస్తాను అంది సరళ ఎందుకొచ్చిందీ, ఏమి తెచ్చిందీ అన్నీ కామాక్షికి తెలిసిపోయింది తను పుల్లయ్యావరం తంతు చేసింది మగడు అన్నగారింటి కెళ్ళినట్టుగా అబద్ధం చెప్పాడు ప్రసాదుకి అసలు విషయం తెలిస్తే అనుకుని

సరళా! మా అన్నయ్య ఇంటి కెళ్ళానమ్మా! దగ్గిరే కదా అని మీ యింటికీ వెళ్ళితే నువ్వు ఇక్కడ కొచ్చినట్టు ప్రసాదు చెప్పాడు వెంటనే బయల్దేరి వచ్చేసానమ్మా! అన్నట్టు ఈ పూటకి ఉండిపో' అంది కామాక్షి

లే దత్తయ్యా! అసలే కొత్త సంసారం! మళ్ళీ వస్తాలెండి తీరిక చేసుకుని అని మావగారితో కూడా చెప్పి బయల్దేరి పోయింది

ఆమె వెళ్ళాకా సుబ్బారాయుడూ, కామాక్షీ ఒకరు ఆడిన అబద్దాన్ని మరొకరు సమర్థించు కున్నందుకు ఆనందంగా నవ్వుకోవడమే కాదు కొడుకూ కోడలూ ఒకర్నిమించి మరొకరు తమ పట్ల భక్తిశ్రద్ధలతో ఉన్నారని తెలుసుకుని తమ మనస్సుల్లో ఉన్నవి వట్టి అపోహలేనని సంసారాలన్నాకా ఆటుపోటులు తప్పవని మరోసారి తెలుసుకో గలిగారు □






★ నా వయస్సు 16 సం లు నా ఎత్తు మాత్రము 4 అడుగుల 8 అంగుళాలు నేను ఇంకా ఎన్ని సం ల దాకా పెరుగుతాను? పొడుగు పెరగాలంటే ఎటువంటి ఆహారం తీసుకోవలసి ఉంటుంది

● ప్రతివారూ 18 సం ల దాకా పొడుగు పెరిగే అవకాశం ఉంటుంది పొడుగు పెరగటానికి ప్రత్యేక ఆహారం గాని, మందులు గానిలేవు

### సి వి. యస్ ఆర్ – కోవూరు

★ పెద్దలకు, పిల్లలకు 'ఫైలేరియా' వ్యాది రాకుండా నిరోదించే వాక్సిన్ వున్నచో తెలుపగలరు

● ఫైలేరియా రాకుండా వాక్సిన్లు లేవు

దోమలు రాకుండా మురుగు నీరు పారే ఏర్పాట్లు చేయటం, దోమతెరలు వాడటం, రోగ లక్షణాలు ఉన్నవారు వెంటనే చికిత్స చేయించుకోవటం మాత్రమే ప్రస్తుతం ఉన్న పద్ధతులు

### ఎస్ ఆర్ – కడప

★ నా వయస్సు 22 సం లు రోజుకి మూత్రం 7 నుంచి 9 సార్లు వస్తుంది మూత్రంలోను, రక్తంలోను లోపం లేదన్నారు మూత్ర విసర్జనకి 2 నిముషాలు పడుతుంది రోజుకి ఎన్నిసార్లు యూరిన్ పాస్ చేయ వచ్చును మా ఇంట్లో ఎవరికీ చక్కెర వ్యాది లేదు నేను ఏ స్త్రీతోను ఇంకా కలవలేదు

● వానాకాలంలో అధిక సార్లు, ఎండా కాలంలో తక్కువసార్లు మూత్ర విసర్జన జరుగుతుంది. ఎన్నిసార్లు విసర్జించాలనేది ఎక్కడా లేదు మూత్ర విసర్జన నాళంలో ఏదైనా అవరోధం (పిన్ హోల్ మియాటస్) ఉంటే మూత్రవిసర్జనలో ఆలశ్యం జరుగవచ్చును.

### ఆర్. – పెనుగొండ.

★ నాకు 17 సంవత్సరములు గుండె కొట్టుకోవటమూ, కాళ్ళూ, చేతులూ వణకటము, నరాలు కొట్టుకోవటమూ, అప్పుడప్పుడూ తల నెప్పి మొదలయినవి వస్తున్నవి దీనికి కారణాలు ఏమిటి?

● మీకు యాంక్జైటీ న్యూరోసిస్ ఉంది సైకియాట్రిస్టుల సలహా పొంది వైద్యం చేయించుకోవటం మంచిది

### ఎస్. బి ఆర్. – యిందుపురం

★ నా వయస్సు 19 సం లు నేను కొద్దిసేపు ఎండలో తిరిగినా, సినిమా చూసినా సాయంత్రం మూత్ర విసర్జన చేస్తే పసుపుగా పడుతుంది దీనివల్ల శరీరానికి హాని కరమా?

● ఎండలో తిరిగినప్పుడు చెమట ఎక్కువగా పడుతుంది అందువల్ల శరీరంలోని నీటి ప్రమాణం తగ్గి లవణాలు మొదలయినవి మూత్రంలో అదికం అయ్యే అవకాశం ఉంది అందువల్ల మూత్రం పసుపుగావచ్చే అవకాశం ఉంటుంది ఇది ఏ రోగ లక్షణమూ కాదు □



"కలర్ టి.వి.ప్రకటనలు ఏ ఇంజనీర్‌ని ఏమార్చలేవు. అందుకే డీలర్ దగ్గర వున్న ప్రతి సెట్‌ని పరీక్షించాను. అప్పుడే డయనోరాని ఎన్నుకున్నాను."

ఎలక్ట్రానిక్ రంగంలో నిపుణుడయిన శ్రీ పి. ఆనంద్
భాగాల నాణ్యత' మరియు
డయనోరా పనితనం గురించి
వివరాలవరకూ ప్రతిదానిని
క్షుణ్ణంగా పరిశీలించారు.



శ్రీ పి. ఆనంద్ పన్నెండు టెలివిజన్ సెట్ల ట్వీటర్లు, వూఫర్లు, పిక్చర్ ట్యూబ్, సర్క్యూట్రీ, ఫైన్ ట్యూనింగ్ మరియు ఆటో—డిగాస్సింగ్ మెకానిజంలని పరీక్షించారు అప్పుడే ఆయన డయనోరా CT 212 Mark I ని కోరి ఎంచుకున్నారు

"మొట్టమొదటగా చెప్పుకోవలసినది డయనోరా విడిభాగాల గురించి అవి అసలయినవి రెండవది, అభివృద్ధి చెందిన అంతర్జాతీయ విధానంమీద ఆధారపడిన సర్క్యూట్ రూపకల్పన ఇక మూడవది, ఈ రోజున మీరు అంతగా చూడలేని అరుదైన పనితనాన్ని డయనోరా వుపయోగించింది" అని శ్రీ పి ఆనంద్ వివరిస్తారు.

అయితే శ్రీ పి ఆనంద్ ఒక విషయాన్ని మరచిపోయారు. డయనోరా సర్వీస్ జట్టు గురించి. ఒకవేళ ఆయనకి వారి అవసరం వస్తే ఫోన్ చేస్తే చాలు వస్తారు.

**Dyanora®**

# డయనోరా® కలర్




అత్యుత్తమమైనది ఆశించేవారికి

DYN 1699

# పడమట సంధ్యారాగం

## ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

తల ఒంచుకుని సీరియస్‌గా ఎస్టిమేట్ తయారు చేస్తున్నాడు సుధీర్

అతనిని తలలో నుంచి ఉంగరంలా తిరిగిన ఓ వెంట్రుక గాలిలో తమాషాగా ఎగురుతోంది మధ్య మధ్యలో అరచేతితో గడ్డాన్ని రుద్దుకుంటున్నాడు సాలోచనగా అలా రుద్దేటప్పుడతని చేతివేలికున్న పచ్చ పొదిగిన ఉంగరం అందంగా మెరుస్తోంది

గుమ్మంలో నుంచి ఎవరో తనని పరిశీలిస్తున్నట్టు తోచటంతో గబుక్కున తలఎత్తి చూశాడు సుధీర్

ఛాయ!

అతని ముఖం వెలిగింది

సుస్వాగతం అన్నాడు నాటకీయంగా చేతులుచాపి

ఇంతకీ రేపొస్తున్నారా? అన్నదామె లోపలికొస్తూ

కార్తీకమాసం వచ్చిందని ఆదివారం వనభోజనాల కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నారు ఛాయ విజయ సువర్చల ఇంకా కొందరు కలిసి కుటుంబాలతో వెళ్ళాలని అనుకున్నారు

విజయ సుధీర్‌నికూడా రమ్మంటే రానన్నాడట

నీ ఇష్టం నువ్వే అతన్ని ఒప్పించుకో నాకేం తెలీదు అన్నది విజయ కొంటెగా

సుధీర్ రాడా?!

అతను లేకుంటే తనకు ఉత్సాహం ఉండదు అందుకే అతన్ని ఒప్పించాలని ఒచ్చింది ఛాయ

నేను రాను అన్నాడు సుధీర్

ఏం? అన్నది ఛాయ

నన్నెవరని పరిచయం చేస్తారు?

విజయ తమ్ముడని

అయితే రాను

జరిగిన కథ-8 ఇందుకూరు కాలేజీలో ఛాయ లెక్చరరుగా చేరింది ఆమె వెంట తల్లి అన్నపూర్ణమ్మ తమ్ముడు రాజీవ్ ఇందుకూర్ వచ్చేసారు ఛాయ కుటుంబానికి విజయ కుటుంబానికి సన్నిహితం ఏర్పడింది ఛాయ మేడమీద గదిలో ఉండే సుధీర్ ఆమెను ప్రేమిస్తాడు పెళ్ళైన అనసూయ రాజీవ్‌కు ప్రేమలేఖ రాసింది రాజీవ్ అనసూయకు రాసిన ఉత్తరం ఆమె తండ్రి చేతిలో పడింది అనసూయ వాళ్ళు ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయారు ఛాయ తన స్టూడెంటు లీలపడే కష్టాలు చూసి జాలిపడుతుంది అన్నపూర్ణమ్మ మరిది కొడుకు శ్రీనివాస్ వచ్చాడు శ్రీనివాస్ లీలల పెళ్ళి ఇందుకూరులో జరిగిపోయింది సుధీర్ ఛాయ నోటి వెంటే ఆమెకూడా తనను ప్రేమించిన సంగతి వినగలిగాడు రాజీవ్ కాలేజీ ఎలక్షన్లలో పోటీచేసి ప్రెసిడెంటుగా నెగ్గాడు

మరేమని చెయ్యాలి

ఛాయ మొగుణ్ణని

సిగ్గులేకపోతేసరి నవ్వును అణచుకుంటూ అన్నది ఛాయ

నాకెందుకు సిగ్గు?

వస్తారా రారా మీరు?

అలా పరిచయం చేస్తానంటే

అంత సరదాగా ఉందా?!

అబ్బ చెప్పలేనంత! నిన్ను నా బుల్లెట్ మీద ఎక్కించుకుని నా భార్య అని చెపుతూ జూమ్మని ఊరంతా తిరిగెయ్యాలనుంది

పిచ్చెక్కిందనుకుంటారు జనం తమాషాలు మానేసి చెప్పండి సుధీర్ రారూ?

వస్తాను

థాంక్స్

ఉట్టి థాంక్సేనా?

ఇప్పటికింతే! అంటూ అతను చాపిన చేతుల కందకుండా తప్పించుకొచ్చేసింది ఛాయ

వంటలు ఇళ్ళ దగ్గరే చేసుకుపోదాం మళ్ళీ ఏది మర్చి పోయినా బాధపడాలి అనుకున్నారు ఆడవాళ్ళు

నేను అందరికీ సరిపోయేలా స్వీట్స్ చేసుకొస్తాను అన్నది ఛాయ

సుధీర్ పళ్ళు కిళ్ళీలు తెస్తాట్ట మిగినవాళ్ళు సగం మంది అన్నం కూరలూ మిగిలిన సగం మందీ పులిహోర చేద్దాం సాయంత్రం టీ పెట్టుకోటానికి కావలసిన సరంజామా అంతా పట్టుకెడదాం ఫ్లాస్కులు కప్పులు అంటూ ఏం పెట్టుకోవద్దు పిల్లల్ని కాపలాకాయలేక వాళ్ళ దాడినుంచి వాటిని రక్షించలేక చావాలి అన్నది విజయ

ఏమేం కూరలు చెయ్యాలి? అనే విషయం మీద మళ్ళీ చర్చ ప్రారంభమయింది

రేపు వెడతామనగా ఈ రోజు నుంచే ఊపిరాడనట్టుంది అంతలా ఆడవాళ్ళు హడావిడి పడుతున్నా ఈ సమస్యను వాళ్ళకే ఒదిలేసి మగవాళ్ళు మాత్రం జాలీగా ఉన్నారు పేకలు టేపు రికార్డులు కెమెరాలు వ్యాన్ మాట్లాడటం ఇవి మగవాళ్ళకొదిలారు

బంగాళాదుంప వేపుడు వంకాయ ముద్దకూర సాంబారు రసం టమేటా పప్పు ఆవకాయ ఈ ఐటమ్స్ ఉండాలని నిర్ణయించుకున్నారు

పులిహోర ఓ స్వీటు! అంతేనా? గారెలు కూడా ఒండితే బాగుంటుంది గదా? అన్నది సువర్చల

నయం చస్తాం అదంతా రుబ్బి ఒండీ సాయంత్ర మౌతుందిక్కడే ఒద్దు అంది విజయ

అంతా కలిసి తొమ్మిదింటికల్లా విజయ ఇంటికి చేరుకుని అక్కణ్ణుంచి వ్యానులో వెళ్ళటానికి నిశ్చయించుకున్నారు

రాత్రి స్వీట్ తయారు చేసి పెట్టింది ఛాయ ఉదయం పెందలాడే లేచి తలంటుకుంది పసుపు రంగుకు ఎర్రని బోర్డరున్న కంచి చీర ఎరుపు జాకెట్టు వేసుకుని మెడలో ముత్యాలదండ వేసుకుంది చెవులకు ముత్యాల స్టెప్స్ పెట్టుకుంది

సుధీర్ కూడా వస్తున్నాడు! అతనూ ఉంటాడంటే మనసెందుకిలా తుళ్ళిపడుతుంది?! అతను నిజంగా రాకపోతే ఈ పిక్నిక్ తనకింత హుషారివ్వదు బలవంతంగా వెళ్ళాలిసొచ్చేది అనుకుంది ఛాయ

సుధీర్ ఇంకా నిద్రపోతున్నాడు వాచీ చూసుకుందామె ఎనిమిది గంటలయింది!

పైట చెంగు చివర అంచు సన్నగా మెలిపెట్టి అతని చెవిదగ్గర రాసింది ఒక్కసారి విదిలించేసి మళ్ళీ అటు తిరిగి పడుకున్నాడు సుధీర్

"మైగాడ్! ఏమిటా మొద్దు నిద్దర? ఎనిమిదయింది ' ఒంగి అతని చెవి దగ్గర గట్టిగా అన్నది ఛాయ

ఉలిక్కిపడి కళ్ళు తెరిచి, విరిసిన గులాబీలా ఫ్రెష్‌గా ఉన్న చాయనంత దగ్గరగా చూసి ఉక్కిరి బిక్కిరయాడతను

"మెలకువ వచ్చిందా?" సరిగ్గా కూర్చుంటూ అన్నదామె

'కల కంటున్నట్లుగా ఉంది .

'చిత్రం తరువాత తీరిగ్గా కలలు కందురుగాని 'ముందులేవండి ఎనిమిదయింది ఇంకో అరగంటలో మనం, విజయ ఇంటి దగ్గరుండాలి అందరితో పాటివస్తే తంతుంది తమరేమో ఇంకా నిద్ర పక్కే వదల్లేక పోతున్నారు "

# పడమట సంధ్యారాగం

ఎక్సిక్ వద్దుకానీ ఇంచక్కా ఇద్దరం ఇక్కడే ఉండి కబుర్లు చెప్పుకుందామా?!

అతను అడిగే తీరుకు నవ్వొచ్చింది ఛాయకు అది కనిపెట్టి ఆమెను ముందుకు లాగాడు సుదీర్ తూలి అతని దగ్గరగా పడిందామె చుట్టూ అతని చేతులు

కాస్త నవ్వితే చాలు అయ్యగారికింక పట్టపగ్గాలుండవు మెత్తగా విసుక్కుంటూ అతన్నిలేపి బాత్రూంలోకి గెంటి పక్కమీద దుప్పటి దులిపి సరిగ్గావేసి అద్దం దువ్వెనా పౌడరు టేబుల్ మీద అమర్చింది ఛాయ

స్నానం చేసొచ్చి ఏం బట్టలు కట్టుకోనూ? అని కుర్రాడిలా అడుగుతున్న సుధీర్‌ను కొంటెగా చూసి ఏం ఒద్దులెండి అన్నదామె

ఈజిట్?! అంటూ దగ్గరగా వచ్చేశాడతను

బట్టలు తీసిచ్చే నెపంతో మొహం చాటు చేసుకుంది ఛాయ ఆమె ఇచ్చిన బట్టలేసుకుని లైట్‌గా చార్లీ స్ప్రే చేసుకుని తల దువ్వుకో బోతున్న సుదీర్ చేతిలో దువ్వెన లాక్కుని తలవంచి తనే దువ్విందామె

రోజూ ఇలా దగ్గరుండి అన్నీ చూడకూడదూ? మొహాన్ని ఆమె గుండెల కానించుకుంటూ అన్నాడు సుదీర్

ఇంకెంత కొద్ది రోజులే

ఏం కొద్ది రోజులో నావల్ల కావటంలేదు

ఇహ పదండి మీరు విజయా వాళ్లింటికి

నువ్వూ?

ఇద్దరం కలిసొద్దు మీరు ముందెళ్లండి

అసలు నేను మీ వ్యాన్‌లో రాను నా బులెట్ మీదొస్తాను

రాకుండా మానేశారో చూసుకోండి

ఎందుకురానూ? నా ప్రాణం అక్కడుంటే వెదవ కట్టెను నేనేం చేసుకుంటాను? అన్నాడు సుధీర్

నవ్వుతూ కింది కొచ్చేసింది చాయ

రాజీవ్ రానన్నాడు

సుధీర్ ఏడీ? సాంబారు గిన్నె దింపుతూ అన్నది విజయ

తను విడిగా వస్తార్ట అన్నది ఛాయ

అంతా అక్కడికి చేరుకున్నారు

అన్నీ తీసుకున్నామా? ఏం మర్చి పోలేదుగదా? చాపలు జంబుఖానాలు గ్లాసులు విస్తళ్లు చెంబులు అంటూ హడావిడిగా అటూ ఇటూ తిరిగి సరిచూసుకున్నారు రెండు ట్రిప్పులు వెయ్యాలనుకున్నారు

మొదటి ట్రిప్పుకు వ్యాన్‌లో క్రిక్కిరిసినట్లుగా ఇరుక్కున్నారు

అమ్మో నా కాలు!

ఓరి దేముడోయ్ నా పైట చెంగు డోర్‌లో ఇరుక్కుంది

అబ్బ సాంబారేమిటి ఇంత ఘుమ ఘుమ లాడిపోతోంది? విజయగారి చేతి మహత్యమా?

సరే అందులో ములక్కాడలన్నీ టైంపాస్ కోసం లాగించేరు మీరు! సరిగ్గా గిన్నె పక్కనే ఉన్నారు

స్వీట్స్ బుట్ట నా దగ్గర కొచ్చిందర్రో! అయాం లక్కీ

రామచంద్రప్రభో! ఈ మగాళ్ళంతా తినేవాటి దగ్గర సెటిలై పోయారేమిటి? మనకేమన్నా దక్కేనా?

పాపం! విజయగారూ వాళ్లాయన పక్కన లేకపోయె!

నువ్వు మీ ఆయన్ని వెంటేసు కొచ్చి అంటుకుపోయావుగా? మిగతా వాళ్ళ సంగతెందుకులే

నాఖర్మ చూడండి సీట్లన్నీ ఆడవాళ్ళే ఆక్రమించే సరి నా పర్సనాలిటీ పెద్దది నిలబడితే ఎత్తు సరిపోక టాపు మాడు పగలేస్తోంది అక్కడికి చేరిందాకా నాకీ సర్కస్ ఫీట్ తప్పదు గూని వచ్చేస్తుందో ఏంపాడో! ఇలా నవ్వులు విసుర్లు కేరింతలతో అంతా కలిసి తోట దగ్గర బిలాబిలా దిగారు తలా రెండు వస్తువులూ మోసుకెళ్ళి ఉసిరి చెట్టుకింద ప్లాట్‌ఫాంలా కట్టినచోట పెట్టారు

అన్నీ ఒచ్చాయో లేదో చూడండి ఏమన్నా మర్చిపోతే ఈసారి ట్రిప్పులో తెస్తాం ఇదే ఆఖరి ట్రిప్పు అన్నాడు సువర్చల మొగుడు

టీ పొట్లం మర్చిపోయాను వరండాలో గూట్లో పెట్టాను అదీ పంచదార డబ్బాతెండి అన్నది సువర్చల

పాలు?

తెచ్చాం

కప్పులు

సింగినాదం ఇంతమందికి కప్పులా పాడా! పెద్ద డేగిశాతో టీ కాస్తాం ఏది దొరికితే దాంట్లో పోసుకు తాగటమే

సరే మీదయ అంటూ వెళ్ళిపోయాడతను

కొందరు బ్యాచీలుగా విడిపోయి తోట చూడటాని కెళ్లారు

విజయ ఛాయ సువర్చల ఇంకా కొంద రాడవాళ్ళు కలిసి ఓ చెట్టు క్రింద కూర్చున్నారు

అందరూ తలా ఒక పాటా పాడాలి అన్నది విజయ

అమ్మోయ్! నా కయితే వినటమే తప్ప పాడటం రాదు అన్నది సువర్చల

బాత్రూం సంగీతం రాదా?

ఊహూఁ!

దేముడి దగ్గర పద్యం చదువుతావా?

చదవను

మంత్రాలు?

ఆ

భేష్! అవే చదువు

వినటానికి మీకు లేని అభ్యంతరం పాడటానికి నా కెందుకు? అంటూ ఆపీ ఆపీనట్టు కొడుతూ కీచుగొంతుతో ఓం కేశవాయ స్వాహా అంటూ సువర్చల మొదలెట్టగానే అంతా గొల్లున నవ్వేశారు

అంతా ఎవరి కొచ్చింది వాళ్ళు నిస్సంకోచంగా పాడారు మగాళ్ళలో కొందరు కూడా ఉత్సాహంగా పాల్గొన్నారు

లలిత లవంగలతా పరిశీలన అంటూ పాడింది విజయ

చాలా బాగా పాడారు అన్నది ఛాయ

అలా పొగడితే ఒదిలేస్తాననుకోకు ఈసారి పాడాల్సింది నువ్వే అన్నది విజయ

పాడితీరాలా?

మండినట్లుంది జోకు

నీ ప్రణయవనిలోన నేనున్న చాలు ఛాయ కంఠం తీగలా సాగింది

పొగడ్డం కాదు కానీ అద్భుతంగా ఉంది ఇప్పుడు గర్వపడాలి సుదీర్ ఔనూ? అతనేడీ? నెమ్మదిగా అన్నది విజయ

మర్చిపోయారేమో ఎవరైనా ఫ్రెండ్స్ కలిశారేమో నిరాశగా అన్నది ఛాయ

ఒంటి గంటయింది ఇంక భోజనాల కార్యక్రమం కానిద్దాం అంటూ లేచి దుప్పటి సన్నగా మడిచి కూర్చోటానికి వీలుగా పరిచి విస్తళ్ళేసి వడ్డన ప్రారంభించారు

సుదీర్ రాలేదు

ఉక్రోషంతో కళ్ళలోకి నీళ్ళొచ్చాయి ఛాయకి రానని చెపితే తనూ ఇంట్లోనే ఉండేదిగా

ఆమె ఉత్సాహమంతా ఊదేసినట్టు మాయమయింది మౌనంగా నెయ్యి వడ్డిస్తున్న ఛాయను చూసి వచ్చేస్తాడులే దిగులు పడకు అన్నది విజయ

వేళాకోళంగా

ఛాయ మొహం ఎర్రబడింది

ఇంతలో దడదడమంటూ దూసుకొచ్చి ఆగింది మోటారు సైకిలు

నేతి గిన్నె విజయ కిచ్చేసి ఛెంగున అతని దగ్గర కెళ్ళి ఇంతాలస్యమైందేం? అన్నది ఛాయ

ఆమె మొహం చూసి కొంటెగా నవ్వాడు సుదీర్

అప్పుడు తెలిసింది ఛాయకు తనెంత తొందరపడిందో చుట్టూ ఉన్నవాళ్ళు ఏమనుకొంటారో అని తడబడింది

ఇదంతా గమనిస్తూనే ఉంది విజయ

అందరి కళ్ళనిండా అనుమానం కుతూహలం

ఎవరతను? అన్నది సువర్చల ఆరాగా

ఛాయకు కాబోయే భర్తగా సుదీర్‌ను అందరికీ పరిచయం చేసింది విజయ

క్షణంలో మళ్ళీ పూర్వపు వాతావరణం నెలకొన్నది అంతా కలిసి ఛాయా సుధీర్‌లమీద జోక్స్ వెయ్యటం ప్రారంబించారు

థాంక్స్! అన్నాడు సుదీర్ విజయతో

నువ్వు కావాలనే ఆలస్యం చేశావుగదూ? అన్నది విజయ

ఏలాగైనా అనుభవజ్ఞురాలివి!

బోజనాలయ్యాక కిళ్ళీలు వేసుకుని కొందరు నడుంవాలిస్తే కొందరు పేకాట మొదలెట్టారు మరికొందరు తోట చూడటానికెళ్ళారు

అది అరవై ఎకరాల తోట చాలావరకూ కొబ్బరి చెట్లు నిమ్మ నారింజ సపోటా మామిడి చెట్లు ఉన్నాయి

చాయ సుధీర్ పక్క పక్కన నడుస్తూ మామిడిచెట్లమధ్యగా వెడుతున్నారు

అటువేపు ఎవరో వెళ్ళబోతుంటే వాళ్ళిద్దర్నీ కాస్త ఫ్రీ గా తిరగనివ్వండర్రా మీరా పక్క కెళ్ళకండి అని అరిచారెవరో వెనుకనుంచి

అటు రాబోయిన వాళ్ళు నవ్వుతూ అవతలి కెళ్ళిపోయారు అర్ధవంతంగా ఛాయ వేపు చూసి కళ్ళెగరేసి నవ్వాడు సుదీర్

చాల్లెండి గొప్ప! అన్నది ఛాయ

కాస్త ఆలస్యమవగానే ఎందుకలా పరుగెత్తుకొచ్చేశావ్? నాకోసం అంతగా ఎదురుచూస్తున్నావా?!

మాట్లాడవా?

అలిగావా?







ఇడియట్!'

కుర్రాడిలా నవ్వాడతను

అప్పుడే ఎందుకలా పరిచయం చేసేశారు? నెమ్మదిగా అన్నది ఛాయ

చాల్లే! అలా చెయ్యబట్టే అందరూ ఇంత కామ్‌గా ఉన్నారు లేకపోతే ఈపాటికిక్కడ రహస్యంగా జాతీయ అంతర్జాతీయ సమావేశాలు జరిగిపోయేవి 'మిమ్మల్నిద్దర్నీ రోడ్డుమీద కీడవాలి అనే తీర్మానంమీద ఒక్క వీటో కూడా పేలదు

ఎనౌన్స్‌చేస్తే ఏంపోయింది? మీ ఇద్దరికీ ఒకరిమీదొకరికి నమ్మకం లేదా? నిలదీస్తున్నట్లుగా అన్నది విజయ

చ! అదేంకాదు

మరి? ఉండు మీ అమ్మగారిక్కూడా చెప్పేస్తాను

ఇహ ఆవిడ ఇప్పట్నుంచీ పెళ్ళి పెళ్ళి అంటూ గొడవచేసి ఆ మూడు ముళ్ళూ అర్జంటుగా పడేదాకా ఊరుకోదు ఆ తరువాత చాలా ప్రోబ్లమ్స్ వస్తాయి ప్లీజ్ కొన్నాళ్ళు పోయాక చెప్పొచ్చు

సరే కానీ నువ్విప్పుడు నాకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి

"ఎందుకు?

మీ యిద్దరికీ లైను క్లియర్ చేసినందుకు ఈ తోటలో మీరు ఫ్రీ బర్డ్స్! ఎంజాయ్ చెయ్యండి అన్నది నవ్వుతూ అన్నది విజయ

కావాలనే అలా చేసి నన్ను బయటపెట్టి

ఆమె ఉక్రోషం చూస్తుంటే నవ్వొస్తోందతనికి

ఛాయతో కలిసి అలా తోటలో తిరుగుతుంటే ఆ గంట గడవకుండా ఉంటే బాగుండుననిపిస్తోంది

అటూ ఇటూ తిరిగొచ్చేసరికి అయిదయింది

అందరూ లేచి మొహాలు కడుక్కుని రెడీ అయ్యారు చుట్టుపక్కలున్న చితుకులు ఏరుకొచ్చారు ఆడవాళ్ళు మూడు రాళ్ళు నిలబెట్టి పొయ్యి తయారుచేసి అంటించి టీ నీళ్ళు పడేశారు పొయ్యి చుట్టూ కూచుని పుల్లలు ఎగదోస్తూ

ఇళ్ళ దగ్గరయితే ఇలాంటి పొయ్యిలమీద టీ కాస్తామా? గ్యాస్ అయిపోతే తడుములాడుకు ఛస్తాం! అలాంటిది ఇక్కడిలా 'టీ పెట్టుకోటంలో ఎంత థ్రిల్ అనుభవిస్తున్నామో! అంటూ టీ తయారయ్యాక పెద్ద గిన్నెలోకి ఫిల్టర్‌చేసి గ్లాసులు పట్టండి ఆడా మగా ఎవరి గ్లాసులు వాళ్ళే వెతికి తెచ్చుకోవాలి అంటూ నవ్వారు ఆడవాళ్ళలో కొందరు

ఎవరి కేది దొరికితే గ్లాసులు చెంబులు అనే బేదం లేకుండా వాటిలోనే టీ పోసుకు తాగుతూ ఇంటి దగ్గరయితే కప్పులూ సాసర్లూ అంటూ స్టైలంతా ఒలకబోస్తాం ఇక్కడదంతా ఏమయిపోయిందో అంటూ మగాళ్ళు కూడా నవ్వుకున్నారు

# ధర్మపథం

## విన్న మాత్రాన లాభం లేదు.





ఆధ్యాత్మిక విషయాలను గురించి కాని ఉపయుక్తములైన ఇతర విషయాలను గురించి కాని తగినవారు ఉపన్యసిస్తున్నప్పుడు వినుటకు చాలా మంది వెళ్తారు కొందరు వినడంతోనే తృప్తిపడతారు కొందరు విని ఇతరులకు ఆ విషయాలు చెప్పడంతో తృప్తిపడతారు వాటిని మనస్సుకు పట్టించుకొని ఆచరణలో పెట్టేవారు మాత్రం చాలా అరుదు ఈ మూడవ వారి పద్ధతే మేలైనది విన్నంత- మాత్రాన ఇతరులకు చెప్పినంత మాత్రాన ప్రయోజనం ఉండదు దీనికి ఒక కదను ఉదాహరణగా తీసుకోవచ్చు

ఒక మహారాజు నిండుకొలువు తీర్చి ఉండగా ఒక బ్రహ్మరక్షస్సు మూడు రకాల పుర్రెలను పట్టుకొని సభలోకి వచ్చి ఈ మూడు పుర్రెల వలన ఏమి గ్రహించవచ్చునో తెలియ జెయ్యాలి లేకపోతే మీ అందరికీ మృత్యువు తప్పదు నేను విడిచి పెట్టను అని గట్టిగా అరచి చెప్పాడు సభ్యులంతా నిశ్చేష్టులై పోయారు రాజు దీనవదనంతో ముఖ్యమంత్రి వైపు చూచాడు గొప్ప ప్రతిభగల ఆ మంత్రి భయపడవద్దని రాజుకు సంజ్ఞ చేసి ఆ మూడు పుర్రెలనూ నా వద్దకు తీసుకునిరా అని బ్రహ్మరక్షస్సును అడిగాడు అతడు అట్లే తీసుకువచ్చాడు

ముఖ్యమంత్రి పొడుగాటి ఇనుప ఊచను ఒక పుర్రె చెవిలో దూర్చగా అది రెండవ చెవి నుంచి బయటకు వచ్చింది ఈ పుర్రె అదముడిది , అని మంత్రి చెప్పి రెండో పుర్రె చెవిలో ఆ ఊచను దూర్చాడు అది నోటినుంచి బయటకు వచ్చింది ఇది మధ్యముని పుర్రె అని మంత్రి అన్నాడు మూడవ పుర్రె చెవిలో ఆ ఊచను దూర్చగా అది తలనుంచి క్రిందిబాగంలోకి పోయింది ఇది ఉత్తముని పుర్రె అన్నాడు మంత్రి ఆ విదంగా ఊహించడానికి కారణాలు ఆ రక్షస్సు ప్రశ్నించగా అదముడు ఒక చెవిలో నుంచి విన్న హితాన్ని రెండో చెవులోంచి విడిచి పెడతాడే కాని పట్టించుకోడు మధ్యముడు ఒక చెవిలోంచి విన్నదానిని నోటితో ఉచ్చరించి తాను అనుసరించకపోయినా ఇతరులకు చెప్పగలడు ఉత్తముడు చెవి నుండి విన్నదానిని హృదయానికిపట్టించుకుని ఆహితాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తాడు అని ఆ మంత్రి సమాదానం చెప్పాడు దానికి బ్రహ్మరక్షస్సు సంతోషించి మేలు కలుగునట్లు దీవించి మాయమై పోయాడు ఏదయినా విన్నమాత్రాన ప్రయోజనం లేదు దానిని మనస్సునకు పట్టించుకొని దాన్ని ఆచరణలో పెట్టాలి

(బాబూజీ గురువాణి ని చదివాక)

– బులుసు వేంకట రమణయ్య

## పడమట సంధ్యారాగం

ఇలా సరదగా అందరూ కలిసొచ్చి అరమరికలు లేకుండా అప్పుడప్పుడు ఇలాంటి ప్రోగ్రామ్స్ వేసుకుంటూ ఉంటే అవగాహన పెరిగి సుహృద్భావ వాతావరణం ఎర్పడుతుంది అనిపించిందందరికీ ఈ అనుభూతి కొన్నాళ్ళపాటయినా సజీవంగా ఉంటుంది అనుకున్నారు

సామానంతా సర్దేశారు

నీ బులెట్‌మీద నువ్వొక్కడివీ ఎం వెడతావు? చాయను కూడా తీసుకెళ్ళు అన్నదీ విజయ

ఒద్దు నేను వ్యానుతో వచ్చేస్తాను అన్నది ఛాయ బింగారుగా

ఏం ఒద్దు మీరు సుదీర్‌గారితో కలిసిరండి మా వ్యానులో ఖాళీ లేదు అన్నారందరూ ఎకగ్రీవంగా

ఇహ తప్పలేదు ఛాయకు

అయిను వెనక కూర్చోపెట్టుకుని వీరుడిలా ముందుకు దూకాడు సుదీంప్

బిగుసుకు కూర్చుంది ఛాయ

పడతావ్ పట్టుకో అంటూ ఒక్క జర్కిచ్చాడతను అతని నడుం చుట్టూ చెయ్యేసి పట్టుకుంది ఛాయ వ్యాన్‌లో వాళ్ళను దాటిపోతూండగా విండోలో నుంచి తల బయటకు పెట్టి హాయ్ హాయ్ నాయకా అన్నది విజయ

అంతా చేతులు బయటకు చాపి టాటా చెప్పారు సిగ్గుతో ఎరుపెక్కిన ముఖాన్ని అతని వీపు కానించుకుంది ఛాయ

ఉద్వేగాన్ని బలవంతాన అణచుకుంటున్నాడతను ఇంటి కొచ్చాక రాత్రి కలలో కూడా ఆ అనుభూతి వదల్లేదు ఇద్దర్నీ

(ఇంకా ఉంది)



# గుణపాఠం

మాధవపెద్ది ప్రజ్ఞాశీలాప్రసాద్

రాత్రి పన్నెండయింది

చీకటి రాత్రి అంతా అందకార బందురంగా వుంది గడియారం టిక్ టిక్ శబ్దం తప్ప ఇంకే శబ్దమూ లేదు అంతా నిశ్శబ్దంగా వుంది

ఎంతో సేపట్నుంచీ ఏడుస్తూ – ఆలోచిస్తూ వున్న మమత నెమ్మదిగా లేచింది మంచం దిగిందది ఎలక్ట్రిక్ స్టౌ తీసింది ప్లగ్ పెట్టింది మెల్లిమెల్లిగా అది వేడెక్కడం మొదలు పెట్టింది – ఎఱ్ఱగా ఆ చీకట్లో ఇంకా ఎఱ్ఱగా కనబడసాగింది పూర్తిగా వేడెక్కిన స్టౌ!

ఆ స్టౌ మీద తన చెయ్యి పెడితే చాలు అంతా అంతా సెకండ్లలో అయిపోతుంది

కన్నీళ్ళు ఉబికాయి నిశ్శబ్దంగానే వెక్కి వెక్కి ఏడిచింది

అంతలోనే మళ్ళీ అనుకుంది అంతా త్వరగా అయిపోవాలి లేకపోతే లేకపోతే కరుణ వచ్చేస్తుంది వచ్చిందంటే – ఇంకంతే అంతా అభాసుపాలు మళ్ళీ తనకీ అవకాశం రాదు మసక బారిన కళ్ళని గట్టిగా తుడుచుకుని దేవుడి పటానికి నమస్కారం చేసింది వెంటనే ముందుకి వంగి – చెయ్యి చాచి – సెగలు కక్కుతున్న స్టౌ

మీద కి

ఉలిక్కి పడింది! గబుక్కున చెయ్యి లాగి పట్టుకున్నారెవరో! గింజుకుంది పట్టుకునే లైటుస్విచ్చి నొక్కారు

స్వాప్లగ్ లాగేశారు తనని లాగి మంచం మీద పడేశారు

తలుపు గడియ పెడుతుంటే– అప్పుడు చూసింది– వచ్చింది కరుణ కాదు రజిత!

నీకేమన్నా పిచ్చిపట్టిందా– ఏమిటీ పని?! – ఉరిమినట్టూ పిడుగు పడినట్టూ గట్టిగా – గద్దించి అడిగింది!

రజిత కరుణ మమత గరల్స్ హాస్టల్లో రూమ్‌మేట్సు మమత జూ నియర్ వాళ్ళిద్దరూ క్లాసుమేట్సు రజిత ఆ రోజు ఆదివారం కావడంతో – ఏదో అర్జెంటు పని మీద ఇంటికెళ్ళి వచ్చింది రైలు లేటు కావడంతో – ఈ టైముకి వచ్చింది కరుణ ఏదో టెస్టుందని – తన క్లాసుమేటు ఇంకో అమ్మాయితో కలిసి చదువుకుంటానని –ఆ అమ్మాయి రూమ్ కెళ్ళింది మాట్లాడలేదు మమత

ఏమైందే – ఏం జరిగింది?– తీవ్రత కాస్త తగ్గింది గొంతులో

నాకు చెప్పవూ– ఎందుకీ పని చేశావు? – లాలనగా అడిగింది

చల్లగాలి తగిలింది మేఘం వర్షించడం ప్రారంభించింది

వెక్కివెక్కి ఏడిచింది మళ్ళీ మమత కానీ ఏమీ మాట్లాడలేదు

కాసేపు ఏడవనిచ్చింది మమతని –రజిత ! ఆ తరువాత మళ్ళీ ప్రశ్నించింది

నన్ను చావనియ్యవే – నాకింత కంటే గత్యంతరం లేదు– గొంతు బొంగురుపోయింది

ఏమిటే నీ మాటలు? చావడం నీ ఇష్టమేననుకున్నావా? దానివల్ల ఎంత మందికి బాధో గుర్తించావా?–

మీ అమ్మా నాన్నా నిన్ను కష్టపడి కని – పెంచి – చదువు చెప్పించేది చావడానికేనా? – అయినా దేనికి నీ భయం? ఎందుకీ పిరికితనం? జీవితానికి ధైర్యంగా ఎదురు నిల్చి పోట్లాడాలి గానీ – భయపడి ఇట్లాంటి పన్లకి పాల్పడకూడదు అసలేం జరిగింది చెప్పు –

అంతలోనే కరుణ కూడా వచ్చింది. రజిత ద్వారా – మమత అఘాయిత్యపు పని విని నిర్విణ్ణురాలయింది – ఆమె కూడా!

ఇద్దరూ మళ్ళీ తరచి తరచి అడగ్గా – అసలు విషయం చెప్పింది అంతా – ఏదీ దాచకుండా చెప్పింది!

అది విని వాళ్ళు ఆశ్చర్యంతో తలమునకలయ్యారు! ఎంతో అమాయకంగా వుండే మమత – అసలు నోట్లో నాలుక లేనట్టుండే మమత

# గుణపాఠం

– మగవాళ్ళని చూస్తేనే – అమడ దూరంలో ఆగిపోయే మమత – ఎన్నో కట్టుబాట్లతో – నీతి నియమాలతో – చాదస్తాలతో – సాంప్రదాయాలతో అల్లుకుపోయిన ఇంట్లో పుట్టి – పెరిగిన మమత – ఏ పనీ – తరచి ఆలోచించందే చెయ్యని మమత – ఏ విషయంలో ఏ ఆసక్తీ లేని – చాందస భావాలు కలిగిన మమత –

అతి దారుణంగా – ఒక షోకిల్లారాయుడి చేత – మోసగింపబడింది!

తను మోసపోయిందని తెలుసుకునే సమయానికి – చాలా ఆలస్యం జరిగిపోయింది!

పరమ చాందస భావాలు కలిగిన – తిండీ గుడ్డ కన్నా కన్న పిల్లలకన్నా – పరువు ప్రతిష్టలంటే పడి చచ్చే – వాటికే ప్రాముఖ్యత నిచ్చే మధ్యతరగతి తల్లిదండ్రులకు ఇది అశనిపాతమే అవుతుంది ఈమె పరిస్థితికి వాళ్ళీమెని చంపి పాతేసి – జీవితాంతమూ ఏడవమన్నా ఏడుస్తారు! కానీ క్షమ అనే ప్రశ్నే లేదు! ఇది నిశ్చయం! ఆమెకి ఆ దారి మూసుకుపోయింది!

కొన్నాళ్ళ తర్వాత ఈ హాస్టల్లోనూ వుండనివ్వరు – అదీ మూసుకుపోతుంది!

పోనీ అతని తల్లిదండ్రులకు చెప్దామా అంటే – వాళ్ళు తనని నమ్ముతారా? దారి ఇస్తారా? కడుపులో పెట్టుకుంటారా? ఊహూ – అంతా ఉత్తదే! ఆ దారీ లేదు!

ఇంక తనకు దారేది? నలుగురికీ తెలిస్తే అవమానమేగా? అంతకన్నా, చావు ఎన్నో రెట్లు నయం!

మోసం చేసిన వాడు – ఇంక చేరదియ్యడు! చేరదీసే వాడయితే – మోసమే చెయ్యడుగా? అందుకని – అందుకనే బోరున మళ్ళీ ఏడ్చింది మమత స్నేహితురాలి ఒళ్ళో తలదూర్చి హృదయవిదారకంగా ఏడ్చింది! వాళ్ళిద్దరికీ గూడా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి!

ఇద్దరూ కలిసి చాలాసేపు ఓదార్చారామెని!

అతడి వివరాలన్నీ తెలుసుకున్నారు – నిజమే అతడు అట్లాంటి టైపే – అతని సంగతి వాళ్ళిద్దరికీ తెలుసు – కానీ పాపం మమతకే తెలీలేదు – అది పిచ్చిది! రాత్రంతా ఆలోచిస్తూనే వున్నారు

ఇదిగో చూడు మమతా! చావు దీనికి పరిష్కారం కాదు – అట్లాంటి వాడికి గుణపాఠం నేర్పాలి! మళ్ళీ ఇట్లాంటివి జరగకుండా చూడాలి! వాడి బుద్ధి బాగుపడాలి! లేకపోతే – మళ్ళీ మళ్ళీ ఇట్లాగే చేసి – ఇంకా ఎందరి ప్రాణాల్నో బలిగొంటాడు – అది జరగనీకూడదు – ఆడదంటే – ఆటబొమ్మ కాదు పిరికిపంద కాదు అబలకాదు సబలే అని నిరూపించాలి, తెల్సిందా –'

తెల్లవారేటప్పటి కొక నిశ్చయానికి వచ్చారు ఒక పథకం తయారుచేశారు

మమతకి ఏం చెయ్యాలో చెప్పారు!

* * * * * *

రాజుకి –

రెండు రోజుల క్రిందటి నీ ప్రవర్తనకి నా మనసు పూర్తిగా విరిగిపోయింది నీ నిజస్వరూపం నిజంగా నాకర్థమయింది – అప్పుడే నీకు ఆడపిల్లల జీవితాలతో ఆటలాడటం అలవాటు! దానివల్ల నువ్వే నష్టపోతావన్నది నీకు తెలియడంలేదు కదూ?

నేను నిన్నెంతో నమ్మాను నీ అందం చూసి భ్రమ చెందాను నువ్వెంతో మంచివాడవనుకుని మురిసిపోయాను నా సర్వస్వం నీ కర్పించాను నువ్వు వాడుకున్నన్నాళ్ళూ వాడుకున్నావు మోజు తీరింది విసిరేద్దామనుకున్నావు ఆడపిల్లలకి శీలమే జీవితం అది లేని నాడు ఆమెకింక బతుకే లేదు ఈ పరిస్థితిలో నాకింక ఆత్మహత్యే శరణ్యం ఈ ఉత్తరం నీకందేటప్పటికే నేనుండను రెండు ప్రాణాల్ని బలిగొన్న పాపం వూరికే పోదులే!

ఈ ఉత్తరం కాపీలు తీయించి ఒకటి నా స్నేహితురాలి తండ్రికి(ఆయన పోలీసు ఇన్స్పెక్టర్ – నీకు తెలిసే వుంటుంది) రెండోది మీ నాన్న గారికి మూడోది ఈ జిల్లా కలెక్టర్ గారికి పోస్టు చేస్తున్నాను (నువ్వు నాకు రాసినఉత్తరాలు మన ఫోటోలు గూడా)

వుంటాను –

ఇట్లు
అభాగ్యురాలు
మమత

మమత చేతిలోంచి ఆ ఉత్తరం తీసుకున్నారు రజిత కరుణ.

* * * * * *

కరుణ, రజిత రాజు తండ్రి ఇంటికి వెళ్లారు వాళ్ళు బాగా వున్నవాళ్ళు ధనవంతులమనే అహం కూడా వున్నవాళ్ళే

అతి కష్టం మీద లోపలికి ప్రవేశం దొరికింది వాళ్ళకి. హాల్లో సోఫాలో కూచున్నారు ఇద్దరూ

'ఎవరమ్మా మీరు?'

మీ అబ్బాయి స్నేహితురాలికి స్నేహితురాళ్ళమండీ!'

అంటే–?'

మీ అబ్బాయి గురించి మీకు తెలిసినవి గాక తెలీని విషయాలు కూడా చాలా వున్నాయి చెప్పమంటారా?

చూడండమ్మా – మీకు నేనెవరో తెలిసినట్టు లేదు ఎట్లా మాట్లాడాలో తెలుసుకోండి ఈసారికి ఆడపిల్లలని వూరుకుంటున్నాను "

మేమెవరో మీకూ తెలుస్తున్నట్టు లేదు మేము కూడా గౌరవనీయులైన కుటుంబాల్లో పుట్టిన

వాళ్ళమేనండీ మేము ఒక విషయం సూటిగా చెప్పడానికి వచ్చాం మీ అబ్బాయి ఒక (ఆత్మ)హత్య కేసులో ఇరుక్కోబోతున్నాడు రక్షించుకోండి డబ్బిచ్చే రక్షించుకుంటారో లేకపోతే నీతికీ నిజాయితీకి నిలబడి మీ అంతర్యానికీ అంతరాత్మకీ ధైర్యంగా జవాబే చెప్పుకుంటారో మీ ఇష్టం! మీకు పాప భీతీ దైవ భక్తీ వున్నాయనే ఆశిస్తాము

ఏమిటమ్మా మీరనేది?కేసేమిటి?ఎందుకవుతుంది కేసు?

ఇది చదవండి – మీకే తెలుస్తుంది

ఉత్తరం ఇచ్చారు

ఇవి చూడండి

ఉత్తరాలు – ఫోటోలు

ఏమిటీ నాన్సెన్స్? నాకెందుకివన్నీ? ఆయన చిందులు తొక్కాడు

అవీ మీ అబ్బాయి లీలలు అవి చదివితే మీ అబ్బాయి అసలు రూపం తెలుస్తుంది ఈ ఉత్తరం చదివితే మీ అబ్బాయి ఎంత దూరం వచ్చాడో తెలుస్తుంది ఎంత ప్రమాదంలో ఇరుక్కోబోతున్నాడో తెలుస్తుంది

నేనివి చదవను ముందు మీరిక్కడ్నించి వెళ్ళండి మీరు మిమ్మల్నీ

పళ్ళు పట పటా కొరుకుతూ అవన్నీ విసిరి పారేసాడు

చదవకపోతే మీకే నష్టం మీ అబ్బాయికి రూఢీగా శిక్షపడుతుంది రేపటి పేపర్ల నిండా ఇదే వార్త వుంటుంది ఫోటోలతో సహా ఈ ఉత్తరాల కాపీలు ఫోటోల కాపీలు పోలీసు ఇన్స్పెక్టరుకీ జిల్లా కలెక్టరుకీ కూడా అందుతున్నాయి! ఇటు మీ అబ్బాయినీ రక్షించుకోలేరు అటు మీ పరువు ప్రతిష్టలూ గంగలో కలుస్తాయి వస్తాం– లేచారిద్దరూ

ఆగండి– ఆగారు

కూచోండి – వెదవగోల–

అయిష్టంగానే ఉత్తరం చదివాడు ఆయన మొహం పాలిపోయింది! ఆ తరువాత క్రోధంలో ఎఱ్ఱబడింది! ఆ తరువాత ఆదుర్దా కంగారు – స్పష్టంగా కనబడ్డాయి అదే మొహంలో! పళ్ళు పట పటా కొరికాడు

త్రా ష్టు డు! –

కాసేపాగి – ఆ అమ్మాయి – ఆ అమ్మాయేమయింది? చచ్చిపోయిందా? ఇదంతా నిజమేనా? నన్నేం చెయ్యమంటారిప్పుడు? ఆ వెధవ ఇక్కడ లేడే ? ఎంతో గంభీరంగా వుందామనుకున్నా ఆయనకి సాధ్యం కావడం లేదు

మీ రొక్క పని చేస్తే – ఆ అమ్మాయినీ – మీ అబ్బాయినీ– మీ పరువు ప్రతిష్టల్ని గూడా రక్షించుకోగలరు!

ఏమిటది?–

ఆ అమ్మాయిని – మీ కోడలుగా చేసుకోవాలి–




వీళ్ళేదు ఏ కులమో – ఎ మతమో అదీగాక– ఆగిపోయాడు

ఆ అమ్మాయిది – మీ మతమే– మీ కులమే– అనుకోండి – అయినా అందరిదీ ఒకటే కులం మానవతా కులం– ఏ మతమయినా దేవుడు – ఒక్కడే! మీరా అమ్మాయిని ఆదుకోబోతే – ఆ అమ్మాయి రూఢిగా ఆత్మహత్యకి పాల్పడుతుంది దానికి కారణం మీ అబ్బాయేనని అందరికీ తెలిసిపోతుంది –నిన్న అంత పనికీ పాల్పడితే – మేమే ఆపాం – ఆ తరువాత విషయాలు మీరే అర్థం చేసుకోండి– డబ్బు నేరాన్ని కప్పుతుందేమోగానీ పాపాన్ని కప్పలేదు – మీ అంతరాత్మని మభ్య పెట్టుకోలేరు వస్తాము–

ఆయన ఆలోచించాడు

ఆగండమ్మా – తొందర పడకండి– ఇప్పుడా అమ్మాయి ఎక్కడుందన్నారు పదండి నేనూ వస్తాను– అంత పెద్దమనిషీ కుచించుకు పోతూ– కరుణ రజితల వెంట బయల్దేరాడు

★ ★ ★ ★

ఉరమని పిడుగల్లే వచ్చిన తండ్రిని చూసి ఆశ్చర్యపోయాడు రాజా

అతడి చేతుల్లో మమత ఉత్తరం రెపరెపలాడుతోంది! నోటికి వచ్చినట్టల్లా తిట్టి – ఎడా–పెడా వాయించెయ్యాలని వున్నా – కరుణ రజితల హెచ్చరిక గుర్తుకొచ్చి ఆగిపోయాడాయన!

రాజూ బయల్దేరు

ఎక్కడికి నాన్నా–

చెప్తా – బయల్దేరు–

కారులో వెళ్తూ చెప్పాడాయన – మీ అమ్మా ఆరోగ్యం బాగాలేదు నీ పెళ్ళి చూడాలంది– అందుకే ఏర్పాటు చేశాను – ఇప్పుడు మనం వెళ్ళేది గుడికి – నీ పెళ్ళికి –

నాన్నా

ఆగింక మాట్లాడకు–

★ ★ ★ ★

గుడి దగ్గిర కారాగింది–

రజిత– కరుణ వచ్చారు – రాజా తండ్రిని లోపలికి పంపించి –

రాజాని ఎదుర్కొన్నారు –

మమత ఉత్తరం –

అందింది – తలవంచుకున్నాడు

జరిగిన దానికి మీరు బాద పడుతున్నారా? –

పశ్చాత్తాప పడుతున్నారా? –

నిజంగానేనా లేకపోతే కేసవుతుందనా? –

ప్లీజ్ నన్నేమీ అడక్కండి–

మీరు మమతని నిజంగానే ప్రేమించారా – లేకపోతే ప్రేమించినట్లు నటించి మోసం చేశారా?

తప్పే చేశానని ఇప్పటికయినా గుర్తిస్తున్నారా?

మిస్టర్ రాజా మీలాంటి వాళ్ళకి ఎట్లాంటి శిక్ష విధించాలంటారు? ఆడపిల్లలంటే మీ ఉద్దేశ్యంలో అంత చులకన బావమా?అమాయకురాల్ని మోసగించి –మభ్యపెట్టి చివరికి వాళ్ళ మానప్రాణాల్ని గూడా దోచుకునే మీలాంటి చీడపురుగుల్ని ఏం చెయ్యాలి? ఏం చేస్తే పాపం వుంది? పిచ్చిది – మిమ్మేల్నం చెయ్యలేక – తను తను ఈ అఘాయిత్యానికి పాల్పడింది! మీ డబ్బుతో మీరు ఏదన్నా చెయ్యవచ్చునను కుంటున్నారేమో – మేము మిమ్మల్ని వదలం - మీరు మీ నేరం నించి తప్పించుకోలేరు – మేము విధించే శిక్ష మీరు అనుభవించి తీరాల్సిందే గంభీరంగా అంది రజిత

ఊఁ – ఆగిపోయారేం రండి లోపలికి– దేవుడి ఎదురుగానే – మీ పాపానికి ప్రాయశ్చిత్తం జరుగుతుంది – మీ చేతులకి సంకెలలు పడతాయి – మా నాన్నగారు అదే పోలీసు ఆఫీసరుగారు అక్కడే వున్నారు – మమత తల్లిదండ్రుల్ని గూడా మేమే రప్పించాము – పదండి అంది కరుణ!

లోపలికి నడిచిన రాజా శిలాప్రతిమలా నిల్చిపోయాడు! అక్కడ పెళ్ళికూతురి అలంకరణలో మమత సజీవంగా సగర్వంగా నిలిచి వుంది!

సీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్రమూర్తి –పశ్చాత్తప్తుడైన రాజాని చూసి చిరునవ్వులు చిందిస్తున్నాడు! □

## శేషాలు

-జి. వి. జి.

### "అనురాగ బంధం"లో విడాకుల వకీల్

గిరీశం (మాగంటి ప్రసాద్) డ్రాయింగ్ రూమ్. జుట్టు పీక్కుంటూ ఆలోచిస్తున్న గిరీశం ఎదురుగా ఒక యువతి, యువకుడు వచ్చి, నమస్కరించారు.

"విడాకులకు విడిగా రాక, కలిసొచ్చారేం?" అడిగాడు గిరీశం.

"ఇంకా కాలేదు. చేసుకోవాలనుకుంటున్నాం." అన్నాడు యువకుడు.

గిరీశం విసుక్కున్నాడు: "రాంగ్ అడ్రస్‌కి వచ్చారు. పక్క వీధిలో కల్యాణ సుందరం ఉన్నాడు. అక్కడికి వెళ్ళండి. నేను విడాకుల స్పెషలిస్ట్‌నని తెలీదా?"

"మాకీ విడాకుల కోసమండీ."

"అదేం! పెళ్ళి చేసుకో లేదంటున్నారు. అప్పుడే విడాకులా! అంత స్పీడా?"

ఇంతలో యువతి అందుకుంది: "నాకో భర్తున్నాడండీ."

"ఓహో... మీరు మీ భర్తకి, మీరు మీ భార్యకి విడాకులివ్వాలి. ఆ తర్వాత మీరిద్దరూ పెళ్ళి చేసుకోవాలి. అంతే కదా? అయితే, ఇవి రెండు కేసులన్న మాట. విడివిడిగా ఫీజులివ్వాలి."

శోభన్‌బాబు, సుహాసిని





"ఏ ఇంటి కాపురం"లో చంద్రమోహన్, భానుప్రియ

యువకుడు తెల్లబోయాడు. "అదేంటండీ. విడివిడిగా ఫీజెందుకు? తానేగా కలిసొచ్చాం?"

"ఆ మాత్రం తెలివి ఉండడం మంచిదే. కాని, మన దగ్గర ఆ మాత్రం చాలదు. అంచేత, చెరో అయిదు వేలు ఇచ్చుకోండి. అంతే... మీకు లైను క్లియర్... చెప్పండి... మీ భార్యతో సంసార సుఖం లేదు. అందుకు డాక్టర్ సతీ సావిత్రి దగ్గర సర్టిఫికేట్ తీసుకురండి."

"అబ్బే! అదేం కాదండి. మా ఆవిడకేం లోపం లేదండి." అన్నాడు యువకుడు.

"అబ్బా! చెప్పింది చేయవయ్యా!" అంటూ ఆ యువతి వంక తిరిగి, "మీ ఆయనకు వేరే అమ్మాయితో సంబంధం ఉంది. పాత బజార్లో సీత అని ఉంది. ఆవిడ సాక్ష్యం ఇస్తుంది." అంటూ ఇద్దరి దగ్గా ఫీజులు వసూలు చేశాడు గిరీశం.

ఎస్. దేవీ ప్రసాద్ సమర్పణలో ఎస్. రామలింగేశ్వరరావు నిర్మించిన ఆంధ్రప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "అనురాగబంధం" చిత్రానికి అనిల్‌కుమార్ దర్శకుడు.

### బాలకృష్ణతో, కోడిరామకృష్ణ దర్శకత్వంలో ఎస్. గోపాల్ రెడ్డి చిత్రం "ముద్దుల కృష్ణయ్య"

"జూలై, ఆగస్ట్, సెప్టెంబర్ మాసాల్లో షూటింగ్," అన్నారు ఎస్. గోపాల్ రెడ్డి. ఈయన "మా పల్లెలో గోపాలుడు" అనంతరం నిర్మించే "ముద్దుల కృష్ణయ్య"లో బాలకృష్ణ హీరో. గణేష్ పాత్రో మాటలు, సి. నారాయణ రెడ్డి పాటలు, కె.వి. మహదేవన్ సంగీతం, ఆర్. వి. పొర్లె ఫ్రొటోగ్రఫీతో కోడి రామకృష్ణ దర్శకుడు.

నందిగం దేవప్రసాద్

సమర్పించు

రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

# అనురాగబంధం



ఎస్.రామలింగేశ్వరరావు

అనిల్ కుమార్

PADMALAYA PUBS

“



ప్రెషర్ కుక్కర్స్ డీలర్నైన నేను, ఏది భద్రతగల కుక్కర్లో ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను **అయితే వాటి అన్నింటిలోను** **అత్యంత** భద్రమైనది న్యూ ప్రెస్టీజ్ కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్ని కొనిపెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న-మాట మరియు ఆమె శ్రేయస్సుకే **అత్యధిక** ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట-సర్వదా

న్యూ ప్రెస్టీజ్
ఎంత భద్రమైనదో చూడండి



నూటికి నూరు పాళ్ళుభద్రతను చేకూర్చే

అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి ఆర్ ఎస్) ఒక్క న్యూ ప్రెస్టీజ్కి మాత్రమే కలదు 'వెయిట్ వెంట్' పూడుకొనిపో యినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది ఇది కుక్కర్కు అత్యంత సమీపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణ మించవచ్చును.



న్యూ ప్రెస్టీజ్ **అయితే**, మితిమీరి ఏర్పడిన సీటిఆవిరి జి ఆర్ ఎస్ **ను** బయటకు నెట్టు తుంది తత్ఫలితంగా జి ఆర్ ఎస్ ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రింధికి విడిచిపెడు తుంది గాస్కెట్ను ఒక స్పూన్**తో** **లోపలికి నెట్టండి**

**అంతే**, ప్రెషర్ కుక్కర్ **తిరిగి** వినియోగానికి సిద్ధంగా వుంటుంది న్యూ ప్రెస్టీజ్ **అయితే** ఎన్నడూ **అణుమాత్రంకూడా** ప్రమాదం వుండదు **అందుచేతనే** ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి **అది అత్యంత** భద్రమైనది- సర్వదా ”

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు







**ttk** తయారి.

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే **100%** భద్రమైనది  న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు

MAA (S) TTP 38 TEL 85

# ఇరుగు – పొరుగు

● 1984లో ఎక్కువ కన్నడ చిత్రాలకు పనిచేసినవారు : సంగీత దర్శకుడు సత్యం 14 చిత్రాలకు ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం 170 పాటలు ఎస్. జానకి 109 పాటలు పాడారు చి ఉదయశంకర్ 160 పాటలు రాశారు

● కన్నడ హీరో డాక్టర్ రాజ్‌కుమార్ మధుర గాయకుడే కాక చక్కగా హార్మోనియం వాయించగలరు కూడా ఈయన తండ్రి పుట్టస్వామయ్య నలభై ఏళ్ళ క్రితం కొన్న పారిస్‌లో తయారుచేయబడిన హార్మోనియం ఇప్పటికీ రాజకుమార్ వద్ద ఉంది తండ్రి సాంవత్సరీకంనాడు రాజకుమార్ ఆ హార్మోనియం వాయిస్తూ గానం చేయడం పరిపాటి

● శంకరాచార్య సంస్కృత చిత్రం అనంతరం జి వి అయ్యర్ ఇప్పుడు మధ్వాచార్య చిత్రాన్ని తెరకెక్కిస్తున్నారు ఉడుపి సమీపాన పాజక క్షేత్రంలో ఏడు శతమానాల క్రితం మధ్వాచార్యులు ఉదయించిన ఇల్లు ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉంది అక్కడ చిత్రీకరణ జరిగింది కూడా వాయుదేవుని అవతారమైన ఆచార్యుల ఒడ్డు పొడుగుకు తగ్గట్టు ఆరడుగుల అజానుబాహువైన బెంగుళూరు వాస పి పూర్ణప్రసాద్ అత్యద్భుతంగా ప్రధాన పాత్రను నిర్వహిస్తున్నారట తల్లిగా జయంతి నటిస్తోంది సామవేద శ్లోకాలు నేపథ్యంగా గల ఈ సంగీతభరిత చిత్రానికి మంగళంపల్లి బాలమురళీకృష్ణ సంగీత దర్శకుడు హిమాలయా శ్రేణుల్లో కూడా కొన్ని సన్నివేశాలు తీస్తారట

● చార్లీ చాప్లిన్ ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ వివిన్‌లీ డేవిడ్ నివెన్ పీటర్ సెల్లర్స్ ప్రభృత చలనచిత్ర ప్రముఖుల గౌరవార్థం తపాలా బిళ్ళలను ఇంగ్లండ్ వెలువరించబోతోంది

● పలు ఆస్కార్ అవార్డులు పొందిన గాంధీ పేసేజ్ టు ఇండియా అనంతరం కొందరు పాశ్చాత్యులకు మనదేశ చరిత్రకు సంబంధించిన విషయాలతో చిత్రాలను నిర్మించాలనే కుతూహలం పెరిగింది పన్నెండు మిలియన్ డాలర్ల వ్యయంతో మనదేశంలో తయారయ్యే మౌంట్ బేటన్ ది లాస్ట్ వైస్రాయ్ అనే చిత్రంలో నెహ్రూగా ప్రముఖ నటుడు ఇయాన్ రిచర్డ్‌సన్ నటిస్తాడు స్క్రిప్టును మన కేంద్రప్రభుత్వం ఆమోదించింది కూడా.

● మార్చిలో అస్సాం చలనచిత్ర పరిశ్రమ స్వర్ణోత్సవం జరుపుకుంది అస్సామీ చిత్ర పితామహుడని పేర్గాంచిన జ్యోతిప్రసాద్ అగర్వాలా నిర్మించిన జోయ్‌మతి అనే తొలి అస్సామీ చిత్రం 1935 మార్చి 10న కలకత్తాలోని రోనక్‌హాల్‌లో విడుదల చేయబడింది

● మంగమ్మా శపథం చిత్రాన్ని తమిళంలో బాలాజీ నిర్మిస్తున్నారు కమలహాసన్ సుజాత నాయకానాయికలు

● 1961లో మద్రాసులో పాదం మోపిన నేటి నిర్మాత ఆర్ వి గురుపాదం మొదట నటి పండరీబాయి ఇంట్లో నెలకు ఆరు రూపాయల జీతం మీద నౌఖరు పని చేశారట

● ఎలిజబెత్ టేలర్ ఎనిమిదో సారి పెళ్ళి చేసుకుంది ఆ రోజే ఆమె 24 ఏళ్ళ కొడుకు క్రిస్టఫర్‌కు కూడా వివాహం జరిగింది

● ఒక చలనచిత్రాన్ని మూడు భాషల్లో ఒకే ఫిలిమ్ మీద తయారుచేసే పద్ధతిని చైనాలో కనుకొన్నారు మూడు భాషల్లోనూ సౌండ్‌ను మూడు ట్రాకుల్లో రికార్డు చేస్తారు ఏ భాష కావాలనుకుంటే దానికి తగ్గట్టు ఇయర్ ఫోన్స్‌ను అడ్జస్ట్ చేసుకోవచ్చుట

● మనదేశంలో ఒక్క సినిమాహాలు అయినా లేని ప్రదేశం లక్షదీవులు ఇక్కడి జనసంఖ్య 40 237 మంది మన దేశంలో [illegible] ప్రతి 60 310 మందికి ఒక థియేటర్ చొప్పున ఉంది

● చిన్నారి చేతన 3–డి చిత్రం తదుపరి భాగం ఇంకో మూడు నెలల్లో తయారవుతుందట

(జి ఎ జి)

# ప్రేమించవే మనసా......

అడ్డేపల్లి సుచిత్రాదేవి

(గత సంచిక తరువాయి)

"హలో! శిల్ప స్వరం కోమలంగా వుంది

హలో యీవేళ నా బర్త్‌డే

ఓ హేపీ బర్త్‌డే టుయూ

థ్యాంక్యూ ప్రతిసంవత్సరం బర్త్‌డేకి శ్రీనూ రోజంతా నాతో గడపటం అలవాటు ఈ సారేమో అసలు ఆ సంగతే మర్చిపొయ్యాడు చూడండి మీరిద్దరూ కలిసి యిప్పుడు వెంటనే బయలుదేరి రావాలి

శిల్ప ఏదో చెప్పబోతుండగా మధ్యలో నే వారించాడు భాను

నో నో మీరేమీ అడ్డు చెప్పకూడదు రాత్రి వరకూ మీరిద్దరూ నా గెస్టులు తర్వాత మీ యిష్టం ఈ లోపల మాత్రం నేను చెప్పినట్టు వినాల్సిందే మీరు వస్తున్నారు! నేను ఎదురు చూస్తుంటాను అంతేనా వస్తున్నారా?

అలాగే! అనక తప్పలేదు శిల్పకి

ఎప్పుడూ? మళ్ళీ ప్రశ్న

ఇప్పుడే!

దట్స్ గుడ్ శ్రీనూకి చెప్పండి నేను వెయిట్ చేస్తుంటాను

అవతలతను పెట్టేయటంతో తనూ ఫోన్ పెట్టేసింది

ఆమె పక్కకి వెళ్ళగానే శ్రీనాథ్ ఫ్యాక్టరీకి రింగ్ చేసాడు తను ఆరోజు రావటం లేదని అర్జంట్ లెటర్స్ ఏమన్నా ఉంటే సాయంత్రం యింటికి పంపమని చెప్పాడు

ఈ లోగా శిల్ప వంటతను బ్రహ్మంకి తాము బయటకు వెళుతున్నట్టు చెప్పింది

శ్రీనాథ్ రిసీవర్ పెట్టెయ్యబోతూ అంతలో మళ్ళీ ఏదో గుర్తు వచ్చి ముఖ్యమైన విషయాలేవో అడిగి తను వాటికి చెప్పాల్సింది చెప్పి ఫోన్ పెట్టేసి యిటు తిరిగి చూస్తే శిల్ప అతని కోసమే ఎదురు చూస్తున్నట్టుంది బయలుదేరేందుకు

**జరిగిన కథ-11 :** భువనేశ్వరి, శివశంకరంగార్ల కూతురు శిల్ప ప్రేమించిన శ్యామ్ దూరమవడంతో ఆమె బ్రతుకే చీకటయి పోయింది ఆమెకు ఆ దిగులు నుంచి మరిపించేటందుకు సస్య శిల్పను తమింటికి తీసుకెళ్ళింది విజ్జూ, సస్య, శిల్ప సంజయ్ రజియా కలిసి యాదగిరి గుట్టకు వెళ్ళివచ్చారు పెళ్ళి చేస్తే శిల్ప మనసు కుదుట పడుతుందని సస్య తండ్రితో అంటారు శివశంకరంగారు సస్య ప్రకాష్‌లు ప్రేమించుకుంటారు కానీ ఈ మధ్య ప్రకాష్ మనసులో సస్య తన నసలు ప్రేమిస్తోందా అనే ప్రశ్న ఉదయించింది ప్రకాష్‌లో మార్పు సస్య పసిగట్టింది శ్రీనాథ్ శిల్పల వివాహం జరిగిపోయింది రజియాకు కూతురు పుట్టింది హనీమూన్‌కు వెళ్ళారు శ్రీనాథ్ శిల్ప బెంగుళూరులో శ్యామ్ తల్లి చెల్లెలు కనబడ్డారు శ్యామ్ తల్లి మాటలతో శిల్ప మనసు కలత చెందుతుంది మిగతా ప్రోగ్రాం పూర్తి కాకుండానే తమ వూరికి తిరిగి వచ్చేసారు శిల్ప శ్రీనాథ్ భానుతేజ తన పుట్టిన రోజుకి శ్రీనాథ్‌ను ఆహ్వానిస్తాడు

చీర మార్చుకోవూ?! ఆమె కట్టుకున్న సన్నపూల టెరీకోస్ చీర వంక చూస్తూ అడిగాడు

ఇది బాగానే ఉంది కదా! అనబోయి అతని ముఖం లోని భావాలు గమనించి ఇప్పుడే వస్తాను! అంటూ పైకెళ్ళింది

శ్రీనాథ్ పేపర్ తిరగేస్తూ సోఫాలో కూర్చున్నాడు

పది నిముషాలకి శిల్ప వచ్చింది

అంతలో బ్రహ్మం వచ్చి ఏదో అడుగుతుంటే అతనికి చెయ్యాల్సిన పని చెపుతూంది పేపర్ తొలగించి శిల్ప వంకే చూస్తున్నాడు శ్రీనాథ్

గ్రీన్ బోర్డరున్న ఎర్రని షిఫాను ఆర్గండీ చీర మాచింగ్ జాకెట్ మెడలో మంగళ సూత్రాల చైన్ పక్కనే నిండుగా చంద్రహారం వేసుకుంది చెవులకి ఎప్పుడూ వుండే జూంకీలు చేతులకు రెండేసి బంగారు గాజులు ఉంగరం ఆ అలంకరణలో ఎంతో కళగా ఉంది

శిల్ప శ్రీనాథ్ వైపు తిరిగేసరికి తన వంకే పరిశీలనగా చూస్తున్న అతని చూపులకి యిబ్బందిగా చూస్తూ వెళదామా? అన్నది

ఆ! లేచాడు పేపర్ పెట్టేసి

కారు దగ్గరకు నడవబోతున్న వాడల్లా ఆగి పూలకుండీల్లో వున్న గులాబీ మొక్కల దగ్గర ఆగాడు చక్కగా విరబూసిన గులాబీ బాగా ఎర్రగా ఉన్నది చూసి ఆకులతో కోసాడు అప్పటికే శిల్ప వెళ్ళి కారులో కూచుని ఉంది తనూ కూర్చుని ఓ చేతో యిగ్నిషకకీ తిప్పుతూ మరో చేతో పువ్వందించాడు శిల్ప మౌనంగా అందుకుంది

కిటికీ లోంచి యీ దృశ్యం చూసిన బ్రహ్మం ముసి ముసిగా నవ్వుకున్నాడు

* * * * * *

తలస్నానం చేసిన క్రాఫ్ గాలికి సుతారంగా ఎగురుతుంటే కొత్త సిల్కు లాల్చీ పైజమా వేసుకుని ఉన్న భానుతేజ శిల్ప శ్రీనాథ్‌లను సాదరంగా ఆహ్వానించాడు

తన పరిస్థితికి మనసులో నే నవ్వుకుంది శిల్ప హాల్లోకి అడుగుపెడుతూ

శ్రీనాథ్‌కి భార్యగా యింట్లో ఏమైనా నెరవేరుస్తుందా బయటకి మాత్రం గొప్పగా అతని భార్యగా అతని ఫ్రెండ్స్‌తో మర్యాదలు పాటిస్తుంది!

భానుతేజ నుదుటనున్న కుంకుమ చూస్తూ పూజ అయిపోయిందా? అడిగాడు శ్రీనాథ్

ఆ యిప్పుడే! రండి టిఫిన్ చేద్దాం మీ కోసమే చూస్తున్నాను ఆకలి దంచేస్తుంది అన్నాడు భాను అటు దారి తీస్తూ

కిచెన్‌లోంచి అప్పుడే అటు వచ్చిన భాను తల్లి శ్రీదేవమ్మను చూసి శిల్ప నమస్తే అన్నది

రామ్మా! అంటూ నవ్వుతూ ఆమె శ్రీనాథ్ వైపు తిరిగి ఏవయ్యా శ్రీనూ నిన్నీరోజు యింటికి రమ్మని కొత్తగా పిలవాల్సి వచ్చిందా? అడిగింది

లేదమ్మా నేనే రాబోతున్నాను భాను ఫోన్ చేసాడింతలో అన్నాడు శ్రీనాథ్ తప్పించుకునేందుకై

కుడిచేయి పిడికిలి బిగించి స్నేహితుని పొట్టలో గుచ్చబోయాడు భాను నవ్వుతూ తమాషాగా అలా చెప్పినందుకు

రండి యిప్పటికే ఆలస్యమయి పోయింది! అంటూ డైనింగ్ టేబిల్ దగ్గరకు దారి తీసిందావిడ

శిల్పకు చిన్నప్పట్నుంచి కొత్త వారితో మసలాలంటే బెరుగ్గా వుంటుంది. కానీ యీ రోజు ఏదీ తప్పేట్టు లేదు

పెరుగువడ ముక్క తుంచి నోటిలో పెట్టుకోబోతుండగా భాను అన్నాడు

పెసరట్టు మాకిద్దరికీ యిష్టం పెరుగావడ మాత్రం శ్రీనుకే ఎక్కువ యిష్టం మిమ్మల్ని తరుచూ చేయించమని వేధించుతుండాలే?

అతనికేమి యిష్టాలో అయిష్టాలో కూడా తనింత వరకు గ్రహించనే లేదు! అనుకుంటూ భాను మాటలకి చిన్నగా నవ్వింది అదే సమాధానమన్నట్టు

ఏమిటితను చంటబ్బాయిలాగా పుట్టినరోజు యిలా చేసుకుంటున్నాడు అనుకుంటున్నారా? మళ్ళీ తనే అడిగాడు

అదేం లేదే! అన్నది శిల్ప

నలుగురు అక్కయ్యల తర్వాత పుత్రరత్నంగా పుట్టానుట నేను అమ్మ అన్నింటికీ గారాబం చేస్తుంది యిప్పటికీ నన్ను కన్నందుకుగానూ కన్న యీ ఒక్కరోజూ ఆవిడ యిష్టమట! తల్లి ఆ ప్రాంతంలో లేకపోవటం చూచి నవ్వుతూ చెప్పాడు

ఏమిట్రా అంటున్నావు? అంటూ ఆవిడ అంతలో రానే వచ్చింది శిల్పను చూస్తూ మా శ్రీనాదే కాబోలు మహా మొహమాటస్తుడని అనుకునేదాన్ని యిన్ని రోజులు నువ్వు అంతకు అంచేలాగున్నావు ఏమిటా తినటం? ఆడవాళ్ళు బాగా తినాలి!

ఎందుకు మమ్మీ బాగా తినటం వాళ్ళు ఇంట్లో వాళ్ళ మీద అరిచేందుకు శక్తి కావాలనా? బాను కొంటె ప్రశ్న

ఇంట్లో వాళ్ళు చక్కగా వుంటే ఎందుకు అరుస్తారాడవాళ్ళు ఇంటి సుఖసంతోషాలు మూడు వంతులు ఆ యింటి యిల్లాలి ఆరోగ్యం మీదే ఆధారపడి వుంటాయి ఆమె చక్కగా తిని ఆరోగ్యంగా తృప్తిగా ఉంటే యింట్లో అందరికీ ఆనందం పంచగలుగుతుంది అందుకు! అని ఆమె ఓ కుర్చీ లాక్కుని కూర్చుంటూ మళ్ళీ ప్రారంభించింది శిల్ప వైపు చూస్తూ

నా పెళ్ళయిన కొత్తలో నేనూ నీలాగ తింటుంటే వీళ్ళ నాన్నగారు నా చేత పంతం పట్టు కూర్చుని యిద్దరేసి మనుషుల అన్నం తినిపించేవారు నా మీద ఎపుడేనా కోపం వస్తే నాకిచ్చే పనిష్మెంటు నేను అర్ధశేరు బియ్యపన్నం



# ప్రేమించవే మనసా..

కచ్చితంగా తినాల్సిందే! ఆవిడ మాటల్లో భర్తకి తన మీద గల ప్రేమని తలుచుకుని సంతోషం అంతగా ప్రేమించిన భర్త ఇప్పుడు లేరుకదాని దిగులూ రెండూ ధ్వనించాయి

ఎందుకు చెప్పానంటే అలా మా ఆవిడ చేత తినిపించాలి ఇంత నాజూకుగా ఉంటే పిల్లల్నేం కంటారు? అన్నది నవ్వుతూ శిల్పని చూపెడుతూ శ్రీనాథ్‌తో

ఓ క్షణం శిల్ప శ్రీనాథ్‌ల చూపులు కలుసుకుని విడిపోయాయి ఆ తర్వాత శ్రీనాథ్ భాను మేడపైకెళ్ళిపోయారు

శిల్పకి ఆ యింట్లో ఊపిరాడనట్లుగా వుంది శ్రీదేవమ్మగారి కేమన్నా సహాయం చేద్దామంటే ఆవిడ వంటావిడ చేత చెప్పి చేయిస్తూ

ఎందుకమ్మా యిక్కడ యీ వంట గదిలో నీకు బోరుకొడుతుందేమో చక్కగా మీ ముగ్గురూ కబుర్లు చెప్పుకోండి! అనేసింది

శిల్ప మేడమీద కెళ్ళేసరికి శ్రీనాథ్ భానుతేజ కార్డ్సుముందు కూర్చుని ఉన్నారు

నేను సస్య దగ్గర కెళతాను అన్నది శిల్ప గుమ్మం దగ్గరే ఆగి

మీకేమీ తోచటం లేదనుకుంటాను రండి మీకూ కార్డ్స్ వేస్తున్నాను పిలిచాడు భాను

సారీ నాకంతగా ఆట రాదు సస్య దగ్గర కెళతాను సాయంత్రం వస్తాను అన్నది

అదేంటి? మీరు లంచ్ యిక్కడే భాను మాటలు పూర్తి కాకముందే అడ్డుకుంది శిల్ప

నో ఫార్మాలిటీస్ ప్లీజ్ ఇప్పుడు తిన్నదే హెవీగా ఉంది సస్య యిల్లు యిక్కడికి రెండు ఫర్లాంగులే చాలా రోజులయింది మేము కలుసుకుని సాయంత్రం వస్తాను కదా!

ఒకే ఒకే యిక మీ వారి యిష్టం! భాను తలాడించాడు

నేను డ్రాప్ చేస రానా? శ్రీనాథ్ అడిగాడు లేచి

వద్దు వద్దు నేను వెళ్ళగలను మీరాడుకోండి

సరే అయితే! అతను కారు కీస్ తీయబోయాడు

దగ్గరే కదా నడిచయినా వెళ్ళచ్చు కారు మీకవసరమయితే? తాళాల కోసం అడుగు వెయ్యనే లేదు శిల్ప

నాకేం అవసరం ఉండదు అంతగా అయితే భాను కారుందిగా! శ్రీనాథ్ ముందుకు వచ్చి తాళాలు అందించాడు

ఇంక కాదనలేదు శిల్ప రెండడుగులు వేసి వెనక్కి తిరిగింది భానుని చూస్తూ మీ అమ్మగారు మళ్ళీ వారిస్తారు కాబోలు! అన్నది

నవ్వేడు భాను మీరు వెళ్ళిపోండి నేను చెపుతాను!

ఇక చకచకా వెళ్ళిపోయింది శిల్ప

శ్రీనాథ్ లోపలికి వచ్చి కూర్చోకుండా ముందువైపు పిట్టగోడ దగ్గరకు నడిచాడు శిల్ప స్టీరింగ్ పట్టుకుంటే తన కారుకి అందం వచ్చినట్లనిపిస్తుంది కారు వీధి మలుపు తిరిగే దాకా చూసి వెనక్కి తిరగబోయేంతలో వెనుకనే భాను నిలబడి వున్నాడు

పద వేసావా కార్డ్స్? అడిగాడు శ్రీనాథ్ స్నేహితుడు తన వంకే దీర్ఘంగా చూస్తుంటే అర్థం కాక

ముందిది చెప్పు నువ్వు శిల్ప సంతోషంగా ఉంటున్నారా?

అదేం ప్రశ్న? అక్కడ్నుంచి ముందుకడుగేయబోయాడు కానీ భాను చేయి బలంగా అతని భుజం పట్టి ఆపింది

నాతో కూడా రహస్యాలా? అయినా నువ్వు చెప్పకపోయినా తెలుస్తూనే ఉంది ఇందుకేనా నేను యింటికి వస్తే యిదెక్కడ బయట పడుతుందోనని నా అంతట నేను భోజనానికి యింటికి వస్తారా అన్నా ఎన్నోసార్లు తప్పించేసావు? సూటిగా అడిగాడు భాను

నువ్వేదో పొరబడ్డావు మేము బాగానే వున్నాము!

బుకాయించకు కొత్త దంపతులను చాలామందినే చూసాను మీలాగా ఏ జంటా లేదు ఒకరితో ఒకరు చూపులైనా కలపరు మాట్లాడుకున్నా ఆ అర మాటా ముఖం దించుకునే మాట్లాడుకుంటారు ముఖంలో నవ్వే కనిపించదు ఎందుకిలా ఉన్నారు? ఇష్టపడి చేసుకున్న పెళ్ళేగా?

ఇక దాచుకోలేక పోయాడు శ్రీనాథ్

ఎవరికిష్టం? నేనిష్టపడ్డాను కానీ శిల్ప యిష్టపడ్డేదు అనుకుంటున్నాను నేను కోరుకున్నఅమ్మాయినే చేసుకుంటున్నాను కదా అని సంబరపడ్డానే కానీ ఆ అమ్మాయి నన్ను కోరుకోవాలని ఆలోచించలేక పోయాను! మెల్లగా అన్నాడు దూరంగా చూస్తూ

పెళ్ళికి ముందు అడిగానన్నావుగా!

శిల్పకేదో తప్పనిసరి పరిస్థితి అలా చెప్పక తప్పి ఉండదు!

ఆ తప్పనిసరి పరిస్థితేమిటో నాకీ మధ్యనే తెలిసింది! గభాల్న అనాలోచితంగా అనేసాడు భాను

శ్రీనాథ్ చివుక్కున స్నేహితుడి వంక చూసాడు

ఎందుకు నోరు జారానా?' అని అప్పుడుగానీ అనుకోలేదు భాను

ఏం లేదు వాళ్ళ అమ్మా నాన్న బలవంతం చేసారట! సర్దుకోబోయాడు కానీ శ్రీనాథ్ నమ్మలేదు

భానూ నీకేం తెలుసో చెప్పు నా భార్య గురించిన వివరాలు నీకు తెలిసి నాకు తెలియకపోవటం బాగులేదు! శ్రీనాథ్ కంఠం ఆదోలా పలికింది

ఇక అతని దగ్గర్నుంచి మాట వెనక్కి తీసుకోవడము సాధ్యపడదు అని తెలుసు భానుకి అందుకే తప్పనిసరి అయి గొంతు విప్పాడు

శిల్ప శామ్ ప్రేమించుకున్నారు పెళ్ళికి ఇరువైపులా పెద్దల్ని కూడా ఒప్పించారు కానీ అతను ఏక్సిడెంట్‌లో చనిపోవటంతో ఆ పెళ్ళి ఆమెకు తప్పిపోయిందట!

వాళ్ళిద్దరూ చూసేవారికి అసూయ కలిగేటంత అపురూపంగా సన్నిహితంగా ఉండేవారట! అని తెలిసిన మాటలని మింగేసాడు

నీకు నీకు ఎవరు చెప్పారు? ఆడగలేక అడిగాడు శ్రీనాథ్

క్లబ్బులో యీ మధ్య రాజా అనే కబుర్లరాయుడు పరిచయమయ్యాడు అతను శామ్‌కి స్నేహితుడట మాటల మధ్యన శామ్ గురించి చెపుతూ యీ విషయం చెప్పాడు

శ్రీనాథ్‌కి మదిలో చిత్రమైన భావం కలిగింది పెదవులపై విరక్తితో కూడిన పలుచని నవ్వు మెదిలింది మనిషి దేన్నయితే ఎక్కువగా కోరుకుంటాడో అదే అందకుండా పోవటం మనిషి పుడుతూ తన వెంట తెచ్చుకున్న శాపం కాబోలు! భార్య గురించి ఎన్నెన్ని కలలు కన్నాడు తను తనూ భార్య చక్కని ముద్దులొలుకు పిల్లలు యిలా కుటుంబం గురించి ఎన్ని ప్లానులున్నాయి ఊహల్లో? చివరికేమయింది?

శ్రీనూ యిది తెలిసి నేనెంతో బాధపడ్డాను ఎందుకంటే నువ్వెప్పుడూ నీ ఆశలన్నీ నాతో చెబుతుండేవాడివి సరే అయిందేదో అయింది ఆ అమ్మాయి అదంతా మర్చిపోయి మీరిద్దరూ హాయిగా వుంటే నీకసలీ విషయం తెలియాల్సిన అవసరమే లేదనుకున్నాను కానీ మీరిద్దరూ భార్యాభర్తలయ్యీ ఏదో అపరిచితుల్లా సంచరిస్తున్నారు మీరు హేపీగా ఉన్నారా లేదా అన్న వేరా మర్చలో నేనిదంతా చెప్పి నీకు వేదన కలిగించాను!

శ్రీనాథ్ అక్కడ నిలబడే శక్తి లేనట్లు లోపలికి వచ్చి కుర్చీలో వాలిపోయాడు భాను అతని వెనుకే రాలేకపోయాడు శ్రీనాథ్‌నలా చూస్తూ గిల్టీగా ఫీలయ్యాడు

ఒక చేదు నిజంకన్నా తీయని అబద్ధం మంచిదంటారు నేనిదంతా చెప్పి తప్పు చేసాను! అయినా శ్రీనూ ఎంత గంభీరంగా ఉంటాడు!

**నా మనసులో ఏ విషయమూ గోప్యంగా ఉండదేం? ఈ బడబడా వాగే గుణం వలనే యిలా అంతా జరుగుతుంది! తనను తాను నిందించుకుంటూ అక్కడే నిలబడిపోయాడు**

కొన్ని నిముషాలలాగే కరిగిపోయాయి

లోపల్నుంచి శ్రీనాధ్ బానుని ఎలిచాడు అతని కంఠం ఎప్పటిలా మార్దవంగా ఉంది

రా అక్కడే ఉన్నావేం? కార్డ్సులో పందెం చెప్పావుగా అనవసరంగా మా ఆలోచనలతో నీ బర్త్‌డేని స్పాయిల్ చేసుకోకు కమాన్!

బాను మెల్లగా అడుగులు వేసుకుంటూ వచ్చాడు మిత్రుడి వైపు చూసాడు శ్రీనాధ్ ముఖంలో యిందాకటి బాధా వీచికలేమీ లేవు నిర్మలంగా ఉంది అంత త్వరగా తనని తాను కంట్రోల్ చేసుకున్న అతని నిగ్రహ శక్తికి ఓ క్షణం విస్మయం కలిగింధి బానుకి

* * * * * *

సెలవుల మూలంగా సస్య యింట్లోనే వుంది

కాలింగ్ బెల్ మోత విని తలుపు తీసి గుమ్మం దగ్గర నిలుచుని ఉన్న శిల్పను ఆశ్చర్యంగా సంతోషంగా చూసింది

హాయ్ శిల్పీ చెప్పా పెట్టకుండా ప్రత్యక్షమై పోయావేమిటి? మీ వారు కూడా వస్తున్నారా? శ్రీనాధ్ కారుని గమనించి అడిగింది సస్య అతని కోసం వెనుక చూస్తూ

నేనొక్కదాన్నే వచ్చాను! లోపలికి నడుస్తూ చెప్పింది శిల్ప మళ్ళీ తలుపు వేసి శిల్పను అనుసరిస్తూ అడిగింది సస్య

ఏమిటి విశేషాలు? ఎలా వున్నారు లెటర్స్ సరే రాయవు అప్పుడప్పుడు నాతో ఫోన్‌లో అయినా మాట్లాడొచ్చు కదా? ఎంతసేపూ నేనే చేయాలా అని నాకూ కోపం వచ్చింది!

అయిందా నీ నిష్ఠూరము ప్లస్ కుశల ప్రశ్న? నవ్వింది శిల్ప

ఇల్లంతా నిశబ్దంగా ఉండటంతో ఎవరూ లేరా యింట్లో? అడిగింది

ఎవరూ లేరు ప్రియా నేనూ బిక్కు బిక్కుమంటూ ఉంటే నువ్వొచ్చి రక్షించావు డైతులు ఉత్తరం వ్రాస్తే నాన్న పల్లెకు వెళ్లారు అన్నయ్య ఫ్రెండుకి పెళ్ళిట వదిన్ని కూడా తీసుకెళ్ళాడు

విజ్జూ వాళ్ళ యింటికి తాళం వేసుందేం?

విశాలాక్షి, విజ్జూ యిద్దరూ బయటకెళ్ళినా యాదమ్మ ఎప్పుడూ యింట్లోనే ఉండేది వాళ్ళు ఊరికి వెడితే తప్ప తాళం ఉండటం చూసి అడిగింది శిల్ప

ఆంటీ విజ్జూ యిద్దరూ ఊరికి వెళ్ళారు?

ఇపుడే వూరికి? ఆంటీ సామాన్యంగా ఊర్లకెళ్ళరుగా ఎందుకు?

ఏమో విజ్జూ వాళ్ళ మావయ్యగారి ఊర్నుంచి వెంటనే యిద్దర్నీ బయలుదేరి రమ్మని టెలిగ్రామ్ వచ్చిందట వెళ్ళారు!

పాప ఏది? అటు యిటూ చూస్తూ అడిగింది

ఆ యిప్పటిదాకా మేలుకునే ఉన్నది ఎవరూ లేరుగా దానికి నేనూ నాకదీ తోడు నేను నోరు వూరకుండక ఏదేదో వాగుతూ పాటలు పాడుతుంటే తనకేమిటో అర్ధమవుతున్నట్లే ఊకొడుతుండింది ఇప్పుడే నిద్రపుచ్చాను కాసేపు చదువు కుందామని

సరే గానీ యిక నీ కబుర్లు చెప్పవోయ్! అన్నది సోఫాలో ఏటవాలుగా వాలుతూ

కబుర్లేమున్నాయి ఈ రోజు బానుతేజ పుట్టిన రోజట పొద్దున్నే అక్కడికెళ్ళాము తనక్కడే ఉన్నారు దగ్గరే కదా నేను మళ్ళీ సాయంత్రం వస్తానని యిటు వచ్చేసాను

అవునేవ్ నిన్న నాకూ ఫోన్ చేసి యిన్‌వైట్ చేసారు భానుతేజ నేనా సంగతే మర్చిపోయాను చూడు అయితే నువ్వు యిప్పుడు అక్కడ్నుంచా రావటం? నేను అమ్మా వాళ్ళింటి నుంచి కాబోలు అనుకుంటున్నాను అన్నది

లేదు సంక్రాంతి ఎటూ వచ్చేసిందిగా పిలుచుకెళ్ళడానికి మమ్మీ వస్తానంది వెళతాను! చెప్తూ శిల్ప అంతవరకూ సస్య చదువుతున్న పుస్తకాన్ని చేతిలోకి తీసుకుని చూడసాగింది

అది గమనించి సస్య అన్నది ఒక యియర్ ఎటూ అయిపోయింది కదా ఫైనలియర్ ఎగ్జామ్స్ పోనీ నెక్స్ట్ యియర్ అయినా వ్రాయరాదూ?

చూద్దాంలే నువ్వెలా చదువుతున్నావు? క్లాసు వస్తుందా షాజీ ఫ్లారీ నందా ఏమంటున్నారు?

అందరికీ పెళ్ళి మీద గాలే సునందకి మాత్రం శ్రద్ధ అది ఎమ్ ఫిల్ చేస్తుందట ఇక షాజీ సంగతి తెలిసిందేగా యీ పరీక్షల కోసం ఊపిరి బిగపట్టుకుని చూస్తుంది ఫ్లారీ అయితే యీ లోపలే రిజిష్ట్రారాఫీసుకి పరుగెత్తినా ఆశ్చర్యపోనక్కరలేదు ఏమిటో ప్రీవియస్‌లో ఉన్నంత ఉత్సాహంగా లేదు నాకు ఏదో చదువుతున్నాను అంతే!

మరిక నెందుకట యింట్రస్టులేని చదువు ప్రకాష్‌కి చెప్పెయ్యరాదూ? నీ చదువే తనకీ నీకూ పెద్ద అడ్డు అంటూ దెబ్బలాడుతాడుగా ఎగిరి గంతేస్తాడేమో నువ్వు యీ మాట చెపితే నవ్వింది శిల్ప

నవ్వలేదు సస్య

అవునూ యింతకీ ప్రకాష్ ఎలా వున్నాడు? ఏమంటున్నాడు ఏదో ఊరికి వెళ్ళాడన్నావు వచ్చేసాడుగా?



ఏమో నేను చూసి చాలా రోజులయింది! సస్య సమాధానం ఆ చెప్పే విధానం చూసి ఆశ్చర్యపోయింది శిల్ప

అదేం అలా అంటున్నావు?

క్లుప్తంగా విషయం చెప్పింది సస్య

అయితే? ఏదో పెద్ద గొడవై పోయినట్లు చెప్తావేం? అంతమాత్రానికే యిక అపార్థాలు విడిపోవటమూనా? అంకుల్‌కీ అన్నయ్యకీ తెలుసా యీ సంగతి? ఎవరూ వెళ్ళి ప్రకాష్‌తో మాట్లాడలేదా?

ఏమిటి నువ్వూ అలా అంటావు? అతని దగ్గర కెళ్ళి పెద్ద అపరాధం జరిగిపోయినట్లు క్షమాపణలు అడిగి వేడుకోవాలా? అప్పటికీ నాకు తెలియకుండానే ఓ రోజు అన్నయ్య ప్రకాష్‌ని కలుసుకుని మాట్లాడాడట అతను చెప్పిన డైలాగులు ఏమిటో తెలుసా?

ఏదో ఓ చిన్న సంఘటన వలన నాకింతగా కోపం వచ్చిందనీ నేనిలా ప్రవర్తిస్తున్నానని అనుకోకండి నేను పొరపడ్డాను కానీ సస్యకి నా మీద ప్రేమ లేదు ఎవరో ఒకరితో పెళ్ళి జరగాలి కదాని నాతో జరిగినందు వలన ఏమిటి నష్టం నేనెటు కోరుకుంటున్నాను కదాని సస్య నాతో పెళ్ళికి ఒప్పుకుని ఉండవచ్చు నాకలా యిష్టం లేదు సస్యకు నేను కాకపోతే ఏం? నాకన్నా మంచి వరుడే దొరుకుతాడు మీరు కావాలనుకుంటే దయచేసి నన్నపార్థం

## ప్రేమించవే మనసా....

చేసుకోవద్దు' అని ఏదేదో చెప్పాడట నాకు తెలుసు యిలాంటిదేదో అతను అనబోతాడని అందుకే ఎవర్నీ అతని దగ్గరకు వెళ్ళొద్దన్నాను వీళ్ళు వింటేగా? తనకు కాబోయే భార్య లోకమంతా తన చుట్టూనే అల్లుకుని వుండాలట ఏదో అర్థం కాకుండా చెప్పాడు అంటే ఏమిటి? ఆవిడెప్పుడు యిక యీయనగారి నామజపం చేస్తుండాలో లేక రోజూ యీయనగారికి పూజ చేసి పాదజలం నెత్తిన చల్లుకోవాలో?!

సస్య తన ఆవేశాన్నంతా శిల్ప ముందు వెదచల్లింది

అయితే సస్యా అతనలా అన్నందుకూ అతనితో పెళ్ళి తప్పిపోయినందుకు నీకేమీ అనిపించటం లేదూ? శిల్ప అమాయకంగా అడిగింది

ఏం అనిపిస్తుంది? అతనికి నేను అక్కర్లేదు అనుకుంటే నాకూ అతను అక్కర్లేదు అంతే" కోపంగా అన్నది.

శిల్పకు నవ్వొచ్చింది ప్రకాష్ నిజమే కదా చెప్పాడు అతనికి నువ్వు కావాలనుకుంటేనే నీకూ అతను కావాలి లేకపోతే అక్కర్లేదూ? అప్పటికి నువ్వు అతన్ని కోరుకున్నదేముంటుంది యిక?

ఆ రకంగా ఎప్పుడూ ఆలోచించని, ఊహించని సస్య ఆ ప్రశ్నకు ఓ క్షణం తెల్లబోయింది ఏం చెప్పాలో తెలియనట్టు

అయినా బింకంగా తల ఎగరవేస్తూ అంటే? అతను కాదన్నా వెంటపడమంటావా? నాకూ అభిమానం ఉంది' విసురుగా అన్నది శిల్ప ఏదో అనబోతుంటే ఆ టాపిక్ తప్పించేస్తూ అడిగింది సస్య

అవునూ నువ్వు శ్రీనాథ్ అప్పుడు ఊరి నుంచి రెండు రోజులకే తిరిగి వచ్చేసారేం? మైసూరు 'జోగ్‌ఫాల్స్ ఏదేదో చుట్టి వస్తామన్నారు కదా?'

"ఎవరు చెప్పారు? ఏరోపోర్ట్ నుంచి నేరుగా తమ యింటికే వెళ్ళిపోయారు కదా తామలా వచ్చేసిన సంగతి ఎవరకీ తెలియదు అనుకుంటుంది శిల్ప

శ్రీనాథ్ మీ నాన్నగారితో చెప్పారుట అంకుల్ మొన్న సాయంత్రం యిక్కడికి వచ్చారు నేను నీ గురించి అడిగితే నాతో చెప్పారు'

డాడీతో చెప్పారా? కారణం కూడా చెప్పేవుండాలే? అసహనంగా అడిగింది శిల్ప

తన కేవో యిక్కడ హఠాత్తుగా అర్జంటు పన్లు తగిలాయట దగ్గరుంచి చూసుకోవాల్సిన అవసరం వుండి వచ్చేసానన్నారుట నిజమేనా?

శిల్పకి తండ్రితో శ్రీనాద్ తన గురించి ఏమీ చెప్పలేదనటం ఎంతో రిలీఫ్‌నిచ్చింది అతని మీద గౌరవమూ కలిగింది

శిల్ప దగ్గరెప్పుడూ దాపరికాలు లేవు కాబట్టి అసలు విషయము చెప్పేసింది బెంగుళూరులో శామ్ అమ్మగారు అక్కయ్య కనిపించారు నాకు మూడ్ పోయింది ఏమనుకున్నారో వెళ్ళిపోదాం అన్నారు వచ్చేసాం' సస్య శిల్ప వంక ఆవేదనంగా చూసింది

నీకు పెళ్ళి కూడా అయిపోయింది శిల్పీ ఇంకా నువ్వు అతని జ్ఞాపకాల్లో ఉంటే ఎలా? శ్రీనాద్ భార్యగా నువ్వు సరికొత్త శిల్పగా మారుతావనుకున్నామంతా? అన్నది

శిల్ప ఏమీ జవాబివ్వలేదు తదేకంగా సీలింగ్ ఫేన్ వంక చూడసాగింది ఇంతలో పాప తను లేచేసినట్టు లోపల్నుంచి సిగ్నల్ యిచ్చింది రాగంతో అరె లేచేసింది యిది అప్పుడే' అంటూ వెళ్ళి ప్రియను ఎత్తుకుని వచ్చింది సస్య

శిల్ప పాప వైపు నవ్వుతూ చేతులు చాపింది

సే హలో టు శిల్పా ఆంటీ! సస్య ముద్దు చేస్తూ పాపతో అంటుంటే బోసినోటితో నవ్వింది ప్రియ తనకేం కొత్త లేనట్టు

శిల్ప పాపని తీసుకుంది ఫారెక్స్ అలవాటు చేసారా?

ఆ యీ మధ్యనే ఎత్తుకుని యిల్లంతా తిప్పుతూ పెట్టాలి దొరసానికి లేకపోతే నోరు విప్పదు వదిన ఒపిగ్గా పెడుతుందిలే అన్నట్టు రా మనం భోంచేద్దాం!

వాళ్ళింట్లో తిన్నది ఏమాత్రం అరగలేదు నాకాకలి లేదు నువ్వు తినుతోడు కూర్చుంటాను'

నేనొక్కదాన్నే కదా అని బద్ధకించి పెద్దగా ఏం చేసుకోలేదులే ఆమ్లెట్ వేస్తాను నీ కిష్టంగా కొద్దిగా తిందూగానీ రా' ఎన్ని రోజులయింది కలిసి తిని' అంటూ లాక్కెళ్ళింది

తిన్నదేదో ఆ తింటున్నప్పుడే అరిగి పోయేట్టు కబుర్లతో గంటసేపు చేసారు భోజన'

(ఇంకా ఉంది)

## జి ఎస్ వి అనంతపురం

★ నేను వేరే కులస్తుని ప్రేమించి మొదటి లెటర్ రాశాను తరువాత అతని ఈ అలవాట్లు ఉన్నాయి దయచేసి మానెయ్యండి అని రాశాను కాని సమాదానం రాలేదు ఇలా ఎందుకు జరిగి వుంటుంది

(1) ప్రేమిస్తుండగానే సాధిస్తుంది అని అనుకొని వుంటాడు

(2) ముక్కు మొహం తెలియని నన్ను ప్రేమిస్తున్నానని రాసింది యిదెంత తెగువరి? అనుకుని వుంటాడు

(3) ముందు బయటపడిన అడదాన్నెవరూ తరువాత గౌరవించలేరు– మరిచిపోకు సోదరీ

## ఎ ఆర్ హైదరాబాదు

★ మనిషిలో కలిగే మానసిక ఆందోళనకి ఆవేదనకు పరిష్కార మార్గం ఏమిటి?

● కారణాలు గుర్తించడం వాటిని తొలగించడానికి ప్రయత్నించడం– ఒక పరిష్కార మార్గం ఏ సైకియాట్రిస్టునో సంప్రదించడం యింకో రైటైన మార్గం

## ఎమ్ ఎస్ అనంతపురం

★ మీ యింటి ఎడ్రస్? నేను మీ మద్రాసుకి దగ్గరలోనే వుంటున్నాను

● అయితే–విజయవాడా దగ్గిరే నా ఎడ్రసు కేరాఫ్ ఆంధ్రపత్రికే?

## జి ఎల్ బి ఖర్గపూరు

★ మన ప్రజలు ఒక రాజకీయ నాయకుడిని ఎన్నుకుని మురుస్తారు కొన్నాళ్ల తరువాత–ప్రజల కోర్కెలు తీర్చడంలేదు పాలనలో ఎన్నో దుష్పనులు సాగిస్తున్నాడు అని దుయ్యపడతారు ప్రజలు ఎవరినీ సరిగ్గా నమ్మరు ఇది రాజకీయ నాయకుల దోషమా? ప్రజల దోషమా?

● ఎవరిదీకాదు ప్రజాస్వామ్యంలో వున్న సుఖం నాయకుడ్ని చేసుకున్నంత మాత్రాన అతగాడిని ఏం చేసినా భరించవలసిన అవసరం లేకుండా చేయగల శక్తి ఒక్క ప్రజాస్వామ్యానికే వుంటుంది ఈ సౌకర్యమే లేకుంటే ఎన్నుకున్న నాయకుడు నియంత అయి కూర్చుంటాడు!

## బి వి ఎన్ ఆర్ కాకినాడ

★ ఇందిరాగాంధీ హత్యపై మీ అభిప్రాయం

● దారుణం కంచే చేను మేయడం అన్న దానికానాడు అర్థం తెలిసింది

## ఎస్ డి ఎస్ నరసరావుపేట

★ నేను ఒక వ్యక్తిని గాఢంగా ప్రేమించాను అంతకంటే ఆ వ్యక్తి నన్ను గాఢంగా ప్రేమించారు హద్దులు మీరని మా ప్రేమకు ఆరు సంవత్సరాల

# ప్రశ్నావళి

కె రామలక్ష్మి

వయస్సుంది ఇప్పుడు యింకొకామె ఆయనను ప్రేమిస్తున్నానంటూ కట్ట లేఖలు రాసింది ఈయన రిప్లయి ఏంటంటే ఇదో నాటకం నోరుమూసుకో అంటున్నారు నేను యీ వ్యక్తిని వదులుకోలేను యింకొకరిని వివాహం చేసుకోలేను

● కథ రంజుగా వుంది చిట్టితల్లీ గాఢం యింకా గాడం అయిన ప్రేమకి గాడాతిగాడమైన ప్రేమ ఎదురైతే– తప్పదుకదా త్యాగం!!

## సాయి, కాశీబుగ్గ

★ తెలిసి నేనెవరికీ అన్యాయం చెయ్యను ఒక వ్యక్తి నామనస్సుతో ఆడుకొన్నాడు ఇపుడా వ్యక్తి మీద అసహ్యం కల్గింది నాతో నేకాదు ఇలా ఇతరులతో పరిచయం ఉందని తెలుసుకున్నాను

● బ్రతికి పోయావు! మనస్సుతో నే ఆడుకున్నాడు–శరీరంతో కాకుండా జీవితాలు సినిమాల్లాగా నడుస్తాయనుకుంటున్నారా?!

## ఎ పి కాశీబుగ్గ

★ మా ప్రశ్నలకు మీ జవాబులు బాగుంటాయి రచయిత్రి కదామీరు చక్కని కథలు పత్రికకు పంపకూడదూ?

● అదే ప్రభా నాకోరికానూ జవాబులు అనుభవంతో కథ రాయిలేనా?!

## పి ఎన్ ఆర్ ఎం పాలెం

★ ప్రేమికులు పరస్పరం అభిప్రాయాలు గౌరవించుకోవాలి గాని ఒకరు బాగుందంటే బాగుందని లేదంటే లేదని అనుకోవడంపై మీ అభిప్రాయం?

● అలాంటి వాళ్లే పెళ్లయ్యాక– నంది అంటేకాదు పంది అనేలా తయారవుతారు! ప్రేమ మైకం మనసునే గాని ఇంగితాన్ని కప్పేయకూడదు

## ఎమ్ వి ఎస్ గౌరీపట్నం

★ మీరు చదువుకున్న రోజులలో విద్యాభ్యాసానికి ప్రస్తుత విధానానికి ఏమైనా తేడావుందా?

● ఎందుకులేదు? ఆ రోజుల్లో లెక్చరర్లని చూసి హడలి చచ్చేవాళ్లం యీ రోజుల్లో వాళ్లు హడలి పోతున్నారు విద్యార్థులంటే అప్పుడు చదువు చదువే వేళాకోళంకాదు గైడ్లు తప్ప పుస్తకం చూడని యీనాటి విద్యార్థులకీ మాకూ పోలికలేదు షేక్స్పియర్ నాటకం పాఠ్యంగా వుంటే అతని నాటకాలన్నీ సెలవుల్లో చదివి చిన్న చిన్న నోట్సు రాసి తెమ్మనెదరు ఇంగ్లీషు మదర్! హిస్టరీ చదువంతా మాపులు ట్రేసు చేయడంకాదు స్కెచ్ మాపులు వేయించేది ఏంషెంట్ హిస్టరీ మదర్లు అంచేతనే కాబోలు– ఇండియా మాపు సునాయాసంగా వేయికల్గేవాళ్లం!

## టి ఎస్ పి చిత్తూరు

★ కన్యాశుల్క నిషేధ చట్టాన్ని పెట్టి దాన్ని నిషేధించినంత సులభంగా వరకట్న నిషేధ చట్టంవల్ల లాభం లేక పోయిందెందుకండి కెరాగారూ?

● అది సిసలైన దొరలు ప్రభుత్వం తెచ్చిన చట్టం కాని ఇదలా కాదే– ఇదో కప్పలతక్కెడ చట్టంగా రూపొందించారు ఎక్కడికక్కడే తప్పుకుందు కనువుగా కాళీలుంచారు– మన నల్లదొరలు □



"పూజారయ్యా    వాళ్ళు ఎలిచింది పిలుపు ఆశ్రమంతా ఉన్న ఆ పూరి గుడిసెలో ప్రతిధ్వనించింది అరుపు ఆ అరుపులో కఠినత్వం కోపం కంటే బాధ నిస్సహాయత స్పష్టంగా ఇమిడి ఉంది

ఉదయ సుందరి తూరుపు పొయ్యి నుండి తీసి వెద జల్లిన బూడిద ఆకాశమంతా ఆవరించి ఉంది ఆ బూడిద మంచులా నేలపైకురుస్తోంది

ఉదయ సుందరి మెడలోని ముత్యాల సరం నుండి రాలిన ముత్యాల్లా చెట్ల కొమ్మల మీద రెమ్మల మీద ఆకుల మీద గడ్డి పరకల మీద నిలిచిన మంచు బిందువులు మెరుస్తున్నాయి

సూర్య నమస్కారం చేస్తున్న పూజారయ్యకు ఆ అరుపు వీపు తట్టినట్లు వినిపించింది పూజ పూర్తి చేసి గబ గబ వాకిట్లోకి వచ్చాడు వాకిటి ముందు పెద్ద గుంపు నిలబడి వుంది



ఆ ఊళ్ళో ఏ పనికైనా తల్లో నాలుకలా మసలే పూజారయ్య అంటే అందరికీ భక్తి గౌరవం అందుకే ఆ ఊళ్ళో వాళ్ళు మంచీ చెడు తెలుసుకోవటానికి ముహూర్తాలు పెట్టించుకోవడానికి అయన దగ్గరకు రోజూ వస్తూనే ఉంటారు కానీ ఈ రోజు వచ్చిన ఇంత మంది ఊళ్ళోవాళ్ళు వారం రోజులుగా వచ్చి చెబుతూనే ఉన్నారు అయన వింటూనే ఉన్నాడు దానికి పరిష్కారం ఆలోచించలేక సతమతమౌతూనే ఉన్నాడు ఆ రోజు తెల్లవారక ముందే వాళ్ళు మళ్ళీ ప్రత్యక్షమయ్యేసరికి ఎక్కడలేని చిరాకు పుట్టింది అయినా లేని నవ్వు ముఖాన పులుముకుని చాల ప్రసన్నంగా వాళ్ళ వైపు చూశాడు వాళ్ళ ముఖాల్లో ఆవేదన కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది

అయ్యా! ఇదేమన్నా న్యాయంగా ఉందా మీరే చెప్పండి నాకొడుకు పుల్లలకని అడవికి వెళితే అక్కడ సెట్టుకు కట్టేసి వచ్చినాడయ్యా మీ శివయ్య

గొడ్లను మేపుతా ఉన్నోడ్ని నీళ్ళు లేని బాయిలో దించేసి వస్తారా?'

చెడబుట్టినాడు చదువు ఎలాగు అబ్బలేదు ఈ పోకిరి పనులు ఎలా అబ్బాయో భగవంతుడా! ఇక ఇలాంటి పనులు చేయకుండా వాడి ఎముకలు విరిచేయాలి అని సణుక్కుంటూ కోపంగా ఇంట్లోకి వచ్చాడు మంచం మీద కొడుకు లేడు పూజారి ఏమీ చేయలేక తన తలతానే బాదుకున్నాడు

*　　*　　*

రేగు పండో రేగు పండ్లు అని అరుస్తూ రేగు పండ్ల బుట్ట నెత్తిన పెట్టుకొని అమ్ముతూ వస్తోంది మల్లి

మల్లికి తండ్రి లేడు పక్షవాతంతో మంచం మీద నుండి లేవ లేని స్థితిలో తల్లి ఉంది మల్లి ఏ కాలానికి ఆ పండ్లు అమ్మి లేదా ముగ్గు పిండి ఎర్ర మట్టి అమ్మి తల్లిని పోషిస్తోంది

పైట నడుముకు చుట్టి తలనిండా పూలు పెట్టి అందమైన నల్లటి ముఖంలో ఎర్రటి పెద్ద చుక్క పెట్టి బొమ్మలా వస్తున్న మల్లిని రౌడీ మూకలో ఒకడు గమనించాడు

తొట్రుపాటుగా గబ గబ పైట సరి చేసుకుంది

చుట్టూ వున్న రౌడీ మూక గొల్లున నవ్వారు

మల్లి నర నరమూ ఉడికిపోయింది అంతే కను రెప్పపాటులో శివయ్య చెంపను ఛెళ్ళు మనిపించింది

శివయ్యను చెంప మీద కొట్టిందన్న మాటేగాని ఆమె ఒళ్ళంతా చెమటతో ముద్దయిపోయింది బాగా కండలు తిరిగి ఆరడుగుల ఎత్తు విగ్రహం శివయ్య అసలే ఎర్రగా ఉన్న శరీరం కోపంతో రక్తం ముద్దలా జేవురించింది అది చూసి ఈ మనిషిని ఎలా కొట్టగలిగానా? అన్న ఆశ్చర్యం బయంతో పిచ్చుకలా వణికిపోయింది మల్లి

ఎదురు చూడని ఈ దెబ్బకు శివయ్య నిలువు రాయిలా నిలబడిపోయాడు అతడి నరనరము ఆవేశంతో బిగుసుకుంది చివుక్కున కండ్లలో నీళ్ళు చిప్పిల్లింది చెంపను తడిమి చూసుకున్నాడు చెంప మీద కాదు కాని గుండెల్లో మంట!

అంత మందిలో ఆడది తనని చెంప మీద కొట్టడంతో అసనంగా ఊగిపోతూ పులిలా రెచ్చిపోయాడు మల్లిని అమాంతంగా ఎత్తి భుజం

# గూడు విడిచిన పక్షులు

## కుమారి. కె. కుమారి

మేకలకు దోటితో ఆకులు కోస్తున్న మా కిట్టుగాడిని సెట్టు కొమ్మకు యేలాడగట్టేసి వచ్చాడయా

ఈ ఊరికి పూజారిగా ఉండి మీ కొడుకును ఇట్టా ఊరి మీద వదిలేసేది ఏమైనా బాగుండాదా? మీ మీద గౌరవంతో ఈ ఇసయాలు పంచాయితీలో పెట్టించలేదు

'ఇంక అతగాడి రౌడీ తనాన్ని సహించేది లేదు

ఇలా అంటున్న వాళ్ళ మాటలకు పూజారి గుండెల్లో రాయి పడింది వారికి ఏం చెప్పాలో అర్థం కాలేదు కొడుకు మీద ఎక్కడ లేని కోపం వచ్చింది చివరకు ఎలాగో తెపరాయించుకొని

తల్లి లేని వాడని గారాబంగా పెంచాను వాడిట్టా తయ్యారయినాడు ఈసారికి నన్ను చూసి క్షమించండి నేను వాడ్ని దండిస్తాను మీరు వెళ్ళండి అని నచ్చ చెప్పాడు

చెనిక్కాయ కుండలో చెయ్యి పెట్టినట్లు ఆ గుంపు గొణుక్కుంటూ వెళ్ళింది

పుట్టి బుద్ధెరిగిన నాటి నుండి ఎంతో గౌరవంగా బతికి బట్టగడుతున్న నేను ఈ రోజు ఈ వెధవ వల్ల ఎంత అపకీర్తిపాలవుతున్నాను నా కడుపున

గురు గురూ మేక వస్తోంది గురూ, అన్నాడు

'కోనేటి కట్ట మీద కూర్చుని పులి మేక ఆట ఆడుతున్న శివయ్య తల ఎత్తి మల్లిని చూశాడు బిగువు సడలని అందాలు చూసేసరికి అతని మనసు ఒక క్షణం వశం తప్పింది మల్లిని ఏడిపించాలనుకున్నాడు

ఏయ్ రేగు పండ్లూ ఇట్టురా పిల్చాడు శివయ్య

మల్లి శివయ్య దగ్గరికి వచ్చి అతడి ముందు గంప దించింది

గంపలోని రేగు పండ్లు చేతిలోకి తీసుకుంటూ ఈ పండ్లు తప్ప పెద్ద పండ్లు లేవామే? ఓర గంట మల్లిని గమనిస్తూ అడిగాడు శివయ్య

ఇవ్వే ఉండేది పెద్ద పండ్లు లేవు

నిజంగా లేవా?'

ఉంటే నేను దాచిపెడతానా?!

దాచే పెట్టేవ్? చూడుంది అంటున్న శివయ్య చూపులు మల్లి ఎదవైపు మళ్ళాయి

అప్పటికిగాని గమనించలేదు మల్లి, తన ఎదపై పక్కకు జరిగిన పైట చెరగును సిగ్గు ముంచుక రాగా

మీద వేసుకున్నాడు మల్లి పెట్టిన కేక గాలిలో కలిసిపోయింది

శివయ్యను అడ్డుకొనే ధైర్యం అక్కడ చూస్తున్న ఎవ్వరికీ లేకపోయింది మల్లి ఎంత గింజుకున్నా శివయ్య వదలలేదు పులి నోట పడ్డ మేక పిల్లలా మల్లి పరితపించింది విలపించింది అల్లాడింది అయినా ప్రయోజనం లేకపోయింది శివయ్య మల్లిని పాడు పడ్డ మండపంలోకి మోసుకొనిపోయాడు ఆమె అరుస్తూనే ఉంది అయినా లెక్కపెట్టకుండా ఆ మండపంలో విసిరి నేల మీద కొట్టాడు ఆ అరుపులు మండపంలోనే సమాధి అయిపోయాయి

*　　*　　*

ప్రకృతి చీకటి ఒడిలో కన్నీరు కారుస్తోంది కారిన కన్నీటి బొట్లు ఆకాశంలో నక్షత్రాల్లా మెరుస్తున్నాయి

ఊరి చివర వెలేసినట్లున్నాయి కొన్ని గుడిసెలు అది వెలివాడ

తల్లి ఒడిలో కుమిలి కుమిలి ఏడుస్తోంది మల్లి కూతురికి జరిగిన దారుణానికి ఆ తల్లి గుండె అట్టుడికినట్లు ఉడికిపోతోంది తక్కువ కులం

వాళ్ళమని ముద్ర వేసి, మానసికంగా, శారీరకంగా అవమానపరుస్తున్న ఈ సమాజాన్ని మనమల్లి నిలువునా తగులబెట్టాలన్నంత ఆవేశం కోపం ఆమెలో ఉంది కానీ మింగలేని కక్కలేని చావు కూతుర్ని ఎలా ఓదార్చాలో తెలియక ఆమె మనసు తల్లడిల్లిపోతోంది

ఈ విషయం తెలిసి ఊళ్ళో పెద్దలందరూ పంచాయితీ పెట్టాలని తీర్మానించారు శివయ్యను మల్లిని యిచ్చారించేందుకు రేపు పంచాయితీ జరగుతుందహో, అని దండోరా ఊరంతా మారు మోగిపోతోంది

వాకిట్లో ఏదో అలికిడి అయ్యేసరికి తల్లి కూతుళ్ళు ఇద్దరు తలెత్తి చూశారు ఎదురుగా పూజారయ్య

ఆశ్చర్యం చోటు చేసుకుంది ఇద్దరిలో

# గూడు విడిచిన పక్షులు

సిన్నోళ్ళు తప్పుసేస్తే పెద్దోళ్ళు ఖరి దిద్దాలి ఎట్టా చేస్తారో ఏంవో నా బిడ్డ బతుకు మీ చేతుల్లో ఉంది

'కాదనను! కానీ అలాంటి కొడుకును దండించాల్సింది పోయి నా పరువు నిలబెట్టండి తల్లీ అని అడగటానికి వచ్చాను

పెద్దోళ్ళు మీరు అనాల్సిన మాటేనా యిది?

దుర్గమా తల్లిగా నీవు పడే బాధ నాకు తెలుసు కానీ మల్లిని నా కోడలుగా చేసుకుంటే ఇక నేను ఈ ఊళ్ళో పూజారిగా తలెత్తుకొని తిరగగలనా? కులస్థులు నా ముఖం మీద ఉమ్మి నన్ను ఊరి నుండి వెలి వేయరా? ఆ తర్వాత అమ్మవారి పాద సన్నిధిలో నాకు స్థానం ఉంటుందా? అమ్మవారి పాద సేవ చేయకుండా నేను బతకగలనా?




అది చూసి పూజారిలో ఎక్కడ లేని నిస్సహాయత ఆవరించింది తల వంచి నిలబడ్డాడు 'ఊరంతా ఆయన ముందు తల వంచుతున్నారు అటువంటి పూజారయ్య మన ముందు తల వంచుతున్నాడే ఇది ఒక నటన కాదుగద్దా,' అన్న సందేహం తల్లి కూతుళ్ళు ఇద్దరిలో పొడసూపింది సందేహంతో పాటు ఆవేశం కూడా చోటు చేసుకుంది

రండి పూజారయ్యా! రండి పేదోళ్ళ బతుకులంటే ఆపై మాటలు పెగలక నోట్లో గుడ్డ కుక్కుకుంది దుర్గమ్మ

విన్నానమ్మా! జరిగిందంతా విన్నాను అలాంటి అప్రాచ్యపు వెదవను కన్నందుకు నేను సిగ్గు పడుతున్నానమ్మా!" సిగ్గుపడుతున్నాను' ఈ మాటలంటుంటే పూజారయ్య గొంతు బొంగురుపోయింది

పూజారయ్యా జరిగిందేదో జరిగిపోయింది అంతకంటే చావడం మేలుకాదా?' కండ్లల్లో నీళ్ళు కమ్ముతుంటే అనలేక అన్నాడు పూజారయ్య

పూజారయ్యా బాధగా అరిచింది మల్లి

"అమ్మా మల్లి! నా కులం పరువు, ప్రతిష్ఠ నీ చేతుల్లో ఉంది పాల ముంచినా నీట ముంచినా నీదే భారం ప్రాధేయపూర్వకంగా అంటూ మల్లి రెండు చేతులు పట్టుకొన్నాడు పూజారి

మా గాలి సోకితేనే మైల పడిపోయినట్టు బాధ పడతారు మీరు కానీ మీ కొడుకు వల్ల మా మనసులెంత మైల పడ్డాయో మీకు అర్థం కాదు మనసు లేని రాళ్ళకు పూజలు చేసే మీకు మనసున్న మనుషుల బాధ మీకు తెలియదు పూజారయ్యా నాలాంటి వాళ్ళ నిండు బతుకులు బలి అయిపోయినా ప్రాణం లేని మీ కులం పరువు, ప్రతిష్ఠలు మాత్రం బలి కాకుండా బతికించుకోండి పూజారయ్యా బతికించుకోండి అని ఆవేశంగా ఒక చెవిలోని కమ్మ తీసి పూజారి చేతిలో పెట్టింది మల్లి

ఆ మాటలు పూజారి గుండెల్లో గునపాల్లా దిగాయి

కూతురు ప్రవర్తన అర్థంగాక కళ్ళు నీళ్ళతో చూస్తూ ఉండిపోయింది దుర్గమ్మ

ఎల్లిరండి పూజారయ్య ఎల్లిరండి ఆ కమ్మే మీ కులాన్ని కాపాడుతుంది అంది మల్లి

మల్లి చెబుతున్నదేమిటో అర్థం కాకుండా అయోమయంగా చూస్తూ పూజారయ్య ముందుకు నడిచాడు

* * *

కాలి ఆరిపోయిన పిడకల్లా ఆకాశంలోని మేఘాలు చల్లారిపోతున్నాయి సూర్యుడు పడమటి గూటిలో దీపమవ్వాలని తాపత్రయ పడుతున్నాడు

ఆ ఊరికి నడి బొడ్డులో మఱ్ఱి చెట్టు మఱ్ఱి చెట్టు కింద పెద్ద బండ

ఆ ఊరిలోని ప్రజలకుగాని పక్షులకుగాని అదే చర్చ బండ సాయంత్రం అయితే మఱ్ఱి చెట్టును చేరి గోల చేస్తున్న పక్షుల్లా రచ్చబండ దగ్గర ఆ ఊరి జనం మూగి తలకొక రీతిగా మాట్లాడుకుంటున్నారు కొందరు గుసగుసలాడుకుంటున్నారు కొందరు బుగ్గలు నొక్కుకొని సైగలు చేసుకుంటున్నారు కొందరు పెదాలు విరిచి వాపోతున్నారు

ఇంతలో అక్కడికి పెద్ద రెడ్డి రావటంతో గాలికి ఎగిరి పడి లేచే పుల్లాకుల్లా అందరు లేచి నిలబడ్డారు పెద్ద రెడ్డి ఠీవిగా వెళ్ళి రచ్చబండ మీద ఆసీనుడయ్యాడు

పెద్ద రెడ్డి దర్పంగా కండువా సరి చేసుకుంటూ తలెత్తి మీసాల కొసల నుండి అందరిని పరిశీలనగా చూశాడు

రచ్చ బండకు ఒకవార భుజాల నిండుకు పైట కప్పుకొని నిలబడి ఉంది మల్లి మరో వార నిర్లక్ష్యంగా తలెగరేసి నిలబడి ఉన్నాడు శివయ్య

ఇక చెప్పండి అన్నట్టుగా పూజారివైపు చూశాడు పెద్ద రెడ్డి

అమ్మవారి ముందున్న కుంకుమ తట్టను తెచ్చి- అమ్మవారి మీద ప్రమాణంతో అబద్ధం చెప్పం, అని శివయ్య మల్లి దగ్గర ప్రమాణం చేయించాడు పూజారి

పంచాయితీలో విచారణకు ముందు అలా ప్రమాణం చేయించడం ఆ ఊరి ఆచారం

గుంపుగా నిలబడిన జనంలో నుండి, ఒకడు ముందుకు వచ్చాడు-

అయ్యా! శివయ్య మల్లిని మండపంలోకి ఎత్తుకుపోవడం నా కళ్ళారా చూశాను , అని జరిగిందంతా వివరించి చెప్పాడు

అంతా విన్న పెద్ద రెడ్డి మౌనంగా తల ఆడించి మల్లిని చూశాడు మల్లి వంచిన తల ఎత్తకుండ నిలబడి ఉంది




## 'మోర్' డిటర్జెంట్ సబ్బు

'మోర్' కొనండి మీ రూపాయికి మరింత విలువ రాబట్టండి.

మరింత తెలుపు. మరింత మెరుపు.
మీ రూపాయికి మరింత తెలుపు చేసే శక్తి.

'మోర్' ధర మరే మంచి డిటర్జెంట్
సబ్బుకన్నా కొద్దిగానే ఎక్కువ. అయితేనేం,
ఇది సైజులో రెండింతలు పెద్దది
దీంతో మరి రెండింతలు బట్టలు
ఉతికే వీలు వుంది!

**రెట్టింపు సైజు. అయినా ధర కేవలం**
**రూ.3.25 పైసలే (పన్నులు అదనం)**

Trikaya BL 2 55 TEL

# ఇవేమన పద్యాలు




మురికిలోనె పుట్టి మురికిలోనె పెరిగి
మురికి బ్రతుకుకింత మురిపమేల
మురికెరిగినవాడు మురికిలో బుట్టునా
విశ్వదాభిరామ వినురవేమ.

అమ్మా మల్లీ! వాడు చెప్పింది నిజమేనా? అడిగాడు పెద్ద రెడ్డి

నీకేం బయం లేదు చెప్పమ్మా రెట్టించి అడిగాడు పెద్దరెడ్డి

మల్లి తలెత్తి పూజారిని చూసింది పూజారి కండ్లల్లో ప్రాధేయతతో కూడిన కన్నీళ్ళు ఉబికి ఉన్నాయి

అనుకోని విదంగా మల్లి తల అడ్డంగా తిప్పింది

అందరూ ఆమెను వింతగా చూశారు ఒక పూజారే తప్ప!

## గూడు విడిచిన పక్షులు

అయ్యగారు! శివయ్య నా బతుకును పాడు సెయ్యలేదు దృడంగా చెప్పింది మల్లి

శివయ్య స్థాణువులా నిలఎడిపోయాడు

అందురు ఆమెను పిచ్చిదాన్ని చూస్తున్నట్లు చూస్తున్నారు అవును అయ్యగారు! శివయ్య నన్ను అనరాని మాట అన్నాడు దాంతో కోపమొచ్చి వాడి చెంప మీద కొట్టాను రెచ్చిపోయిన శివయ్య నన్ను మండపంలోకి తీసుకెళ్ళి దూలానికి కట్టేసి నా చెంప మీద కొట్టినందుకు నిజానికి నీ ముక్కు చెవులు కోసెయ్యాలి కానీ ఆడపిల్లవి కాబట్టి బతికిపోయావు,' అని నా చెవులో ఒక కమ్మ కోపంగా లాక్కొని వెళ్ళిపోయాడు నిజానికి తప్పు నాదే, అంది మల్లి

ఆ మాటలకు శివయ్య ఆశ్చర్యంతో కొయ్యబారిపోయ్యాడు

కమ్మలు తీసుకొన్నందుకే ఊరు ఊరంతా నానా గొడవ చేశారు ఒరేయ్! ఆ కమ్మలు తీసుకెళ్ళి అయ్యగారికి యియ్యవేందిరా! జరిగింది చాలదా? , అని రెట్టించినాడు పూజారి

ఈ కమ్మ అమ్మవారిది పంచాయితీ జరిగేటప్పుడు చేతిలో పెట్టుకో, అని తండ్రి ఎందుకు బలవంతంగా ఒక కమ్మ చేతికిచ్చాడో యిప్పుడు అర్ధమయ్యింది శివయ్యకి తండ్రి అజ్ఞతో యాంత్రికంగా తన చేతిలోని కమ్మను పెద్ద రెడ్డి ముందు ఉంచాడు

ఆ కమ్మను చేతిలోకి తీసుకున్నాడు పెద్దరెడ్డి మల్లి చెవిలోని కమ్మను తీసి యివ్వమన్నాడు మల్లి తీసి యిచ్చింది రెంటినీ పరిశీలనగా చూసి, ఒక క్షణం ఆలోచించి- 'ఈ కమ్మలు మల్లి తీసుకోవచ్చు మల్లిని మండపంలో కట్టేసినందుకు శివయ్య యాభైరూపాయలు జరిమానా కట్టాలని, ఇలాంటి పనులు ఇంకెప్పుడూ సెయ్యకూడదని, పంచాయితీ తీర్మానిస్తా వుందా, అన్నాడు పెద్ద రెడ్డి

మల్లి ఎందుకు ఆబద్ధం చెప్పింది? అన్న సందేహం మదిలో తొలుస్తూంటే శివయ్య తలెత్తి మల్లిని చూశాడు ఆమె కళ్ళల్లో కోటి ప్రశ్నలు ఏ ఒక్కదానికీ సమాదానం చెప్పలేని నిస్సహాయుడు అతడు

అయితే ఆ మరునాడు ఆ ఊరే ఆశ్చర్యంలో మునిగింది శివయ్య మల్లి కనిపించకపోయేసరికి! □

## పైసా!

రాయలేలిన
రాముని
రాజ్యమైనా
నిజానికి
ఇది
రాకెట్ యుగమైనా
పాకెట్‌లో
పైసా లేనిదే
మనిషికి లేదు
మార్కెట్‌లో
మంచీ–మర్యాద!

–ఎస్ మొగులయ్య సాగర్

సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

సంధ్య బుగ్గల్లోకి వెచ్చటి నెత్తురు చిమ్మింది ఎవరో గుండె మీద వేళ్ళతో చప్పుడు చేస్తున్నట్లనిపించింది ఏమైనా తనకీ అనుభూతి కొత్తది హృదయంలో ఇదివరకేగుసగుసలు పలికేవికావు! చిత్రమైన అనుభూతి!

మనోరమకి మీ అయ్యగారంటే అంత ఇష్టమా" ఆదేం ప్రశ్న అన్నట్లు చూసింది మంగి

'అయ్యగ్గారంటే ఇష్టపడని ఆళ్ళెవరుంటారండీ అన్నట్టు చూసింది మంగి

ఆయమ్మకి బాబుగారంటే ప్రాణం! పాపం. అయ్యగారెందుకో ఒప్పుకోలేదు ఎంత ఏడ్చారనుకున్నారు?" మంగి సానుభూతి వ్యక్తం చేసింది

ఏందండమ్మాయిగారూ! శానాసేపయింది ఇయిగో బియ్యం! నేను దొడ్లో కూరలున్నాయేమో చూసొస్తాను! మంగి బుట్ట తీసుకుని దొడ్డి వైపు వెళ్ళింది

ఆలోచనగా బియ్యం తీసుకుని వంట గదిలోకి వచ్చింది సంధ్య. డైనింగ్ హాలులోంచి వంట గదిలోకి వెళ్తుంటే అక్కడే టేబిల్ ముందు కుర్చీలో కూర్చున్న శ్రీకాంత్ కనిపించాడు. అతను అక్కడ చాలా సేపటి నుంచీ కూర్చుని వున్నట్టు తెలుస్తూనే వుంది. టేబిల్ మీద పేపరు పరిచినట్టున్నది అతని చూపులు దాని మీద లేవని కూడా అనిపిస్తూనే వుంది సంధ్య రావటం గమనించి తలెత్తి చూశాడతను క్షణం ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి అతను లేచి సంధ్య వైపు వచ్చాడు ఆమె ముఖంలోకి దీక్షగా చూస్తూ అన్నాడతను

మనోరమను ఎందుకు చేసుకోలేదో తెలుసా! నీ కోసం! నీ కోసం! సంధ్య ప్రూన్పడిపోయింది

**జరిగిన కథ-17 :** సంధ్య, మధులు ప్రేమించుకొంటారు కాని పెళ్ళి చేసుకోలేక పోయారు తన చెల్లెలు భవిష్యత్తుకై మధు మాధవిని పెళ్ళి చేసుకొంటాడు అనుకోని పరిస్థితులలో ఇష్టం లేకపోయినా గీత కోసం, సంధ్య మధు స్నేహితుడు శ్రీకాంత్‌ను వివాహం చేసుకుంటుంది గీత పెళ్ళి మూర్తితో జరిగిపోయింది మూర్తి మొదటి భార్య రాధ పిచ్చిలో తోయటం వల్ల మూర్తి తల్లి మరణించింది మూర్తి రాధను ఆసుపత్రిలో చేర్పిస్తాడు మూర్తి, గీత, శ్రీకాంత్ ఇంటికి వచ్చారు ఎంత సర్దుకున్నా సంధ్య మనసు శ్రీకాంత్‌ను భర్తగా అంగీకరించదు ఆమె మధుకి రాసిన ఉత్తరం శ్రీకాంత్ చదువుతాడు మూర్తి, గీత ఊళ్ళు తిరగను వెళ్తుతారు సంధ్య మనసు శ్రీకాంత్‌పట్ల మృదువుగా మారుతుంది మూర్తి భార్య మరణించింది. మూర్తి ఇల్లు విడిచి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళి పోతాడు గీత తల్లితో బెంగుళూరు వెళ్ళి పోయింది శ్రీకాంత్ సంధ్యను భార్యగా కాకపోయినా ఒక స్నేహితురాలిగానన్న మసలుకోమని కోరుతాడు శ్రీకాంత్ స్నేహితుడు ప్రకాష్ దగ్గర సెక్రటరీగా ఉన్నది మూర్తేనని తెలుసుకొంటారు. మూర్తి, గీతల జీవితం కుదట పడింది. మధు భార్య బిడ్డలతో శ్రీకాంత్ ఇంటికి వచ్చాడు మాధవిని పెళ్ళి చేసుకోడానికి కారణం మధుని అడుగుతుంది సంధ్య శ్రీకాంత్‌కు సంధ్యపట్ల గల ప్రేమ తెలుసుకున్న తను మాధవిని పెళ్ళి చేసుకున్నానని చెప్తాడు మధు.

అమె ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని మృదువుగా ఆమె కనురెప్పల మీద తగిలీ తగలకుండా ముద్దు పెట్టుకున్నాడు

సంధ్య ఉలికిపాటుతో అతన్ని తప్పించుకుని వెళ్ళిపోయింది మంగి కోసుకొచ్చిన కూరలు ప్లాస్టిక్ బ్యాగ్‌లలో పెట్టి ఫ్రిజ్‌లో సర్దుతున్నది వంట చేస్తున్నంత సేపూ సంధ్య ఆలోచిస్తూనే వున్నది తనలో ఏదో మార్పు వస్తున్నది శ్రీకాంత్‌లో కూడా మార్పు కనపడుతున్నది ఇదివరకులా అతను నిశ్చలంగా నిగ్రహంగా వుండటం లేదు అవును, ఎన్నాళ్ళుంటాడు? ఏదో రోజు ఇట్లాంటిది తన జీవితంలో తోసుకు వస్తుందని తనకూ తెలుసు! ఆ లాయరు విడాకులు కుదరదన్నాడు తనకీ ఇష్టం లేదు విడాకులెందుకు? అతని సుఖానికి తను అడ్డు వస్తుంటే కదా! ఈ మాటలు కూడా అతనన్నవే! మధు వెళ్ళిపోయిన తర్వాత ఒక రోజన్నాడు

'సంధ్యా! ఏదో విడాకులు ఇవ్వాలన్న అభిప్రాయంలో వున్నావట ఆ లాయరు నాకు ఫ్రెండ్‌లే! చెప్పాడు! డైవర్సు ఎందుకు? మనిద్దరం ఎవరిష్టమొచ్చినట్టు వాళ్ళుండాలనుకున్నాం కదా! నన్ను పెళ్ళి చేసుకో వద్దని నువ్వు నిర్బంధించటం లేదు నా సుఖాలకి నువ్వు అడ్డు రావు ఇంక ఈ కోర్టుల గోలెందుకు?" అన్నాడు తనూ విసిగిపోయింది అతనిలో రోజు రోజుకీ సహనం తగ్గిపోతున్నది తమ పెళ్ళయి ఇది మూడో సంవత్సరం ఆలోచనలతోనే పగలు గడిచిపోయింది రాత్రి కూడా గడిచిపోతుంది భోజనాలయాక ఇల్లు సర్ది పైకి వెళ్ళేసరికి పది గంటలయింది. శ్రీకాంత్ గదిలో లేదు ఇదివరకులా ధైర్యంగా చొరవగా ఆ గదిలోకి రాలేకపోతున్నది సంధ్య ఆ రాత్రి తన నిర్ణయం చెప్పాలనుకున్నది అతను అలవాటుగా బాల్కనీ పక్కనే కొంచెం కిందగా వున్న ఉయ్యాల బల్ల మీద పడుకుని వుంటాడు! సంధ్య అటువైపుగా నడిచింది ఉయ్యాల బల్ల మీద పరుపు మీద తెల్లని దుప్పటి మీద కుడి చెయ్యి కళ్ళ మీద కప్పుకుని పడుకుని వున్నాడు. సంధ్య అతని తల వైపుగా నిలిబడింది ఆమె ఉనికిని అతడు గమనించలేదు ఉయ్యాల గొలుసులు పట్టుకుంది సంధ్య

ఎవరూ! అతను కళ్ళు తెరిచి చూచి లేచి కూర్చున్నాడు

ఏమిటన్నట్టుగా చూస్తున్న అతన్ని క్షణం సేపు చూసి అంది సంధ్య

మీతో మాట్లాడాలనుకుంటున్నాను!

ఇక్కడ ఈ ఉయ్యాల బల్ల మీద కూర్చోవు కదా! పద- బాల్కనీలో కూర్చుందాం!

వచ్చీ రాని వెలుగుతో అక్కడే బాగుంది సంధ్యకు వెలుగులో అతని ముఖం చూస్తూ మాట్లాడలేదు తను బాల్కనీలో పండు వెన్నెలలా వెలుగు పరుచుకుని వుంటుంది అక్కడ నుంచి లో లెవల్‌లో ఉన్న ఇక్కడ మాత్రం సన్నని వెలుగు వస్తూంటుంది అదీ కాకుండా అక్కడికి ఎవ్వరూ రారు

వద్దు! ఇక్కడే కూర్చుందాం!

ఉయ్యాల మీద చివరకు జరిగాడు శ్రీకాంత్ రెండో చివర కూర్చుంది సంధ్య

నేను- ఏ హాస్టలుకైనా వెళ్దామనుకుంటున్నాను!"

ఎందుకు?

కారణాలెందుకు? మీరు ఇంత కాలంగా నన్ను పోషించారు కాబట్టి మీతో చెప్పటం నా కనీస ధర్మంగా భావించి చెప్తున్నాను!" సంధ్య గొంతు స్థిరంగా వుంది

నీ ధర్మం అంతవరకేనా! నా పట్ల నీ ధర్మాలు ఇంకేమీ లేవా!"

కనీస ధర్మం గురించి మాట్లాడుతున్నాను!"

శ్రీకాంత్ పకపకా నవ్వాడు

సంధ్యా! కనీస ధర్మం అనటంతోనే నీ ధర్మం నుంచి నువ్వు దూరంగా పోతున్నావని ధ్వనింప చేస్తున్నావు!"

సరే, పోతున్నాను! ఏమంటారయితే?'

'ధర్మం పారిపోనివ్వదు ధర్మం రక్షిస్తుంది రక్షింపబడుతుంది!"

నాకు ధర్మమే లేదు నేను భయపడే పారిపోతున్నాను!"

"కారణం కావాలి!"

సంధ్యకు చర్రున వచ్చింది కోపం

ఇదివరకులా లేరు మీరు! నా మీద అధికారాన్ని పొందాలని చూస్తున్నారు మీ సాన్నిధ్యంలో రక్షణ వుంటుందన్న విషయంలో నాకు సందేహం కలుగుతున్నది మీ దగ్గరకు రావాలంటేనే భయంగా వుంది ఏ క్షణంలో మీరే విధంగా ప్రవర్తిస్తారో తెలియకుండా వుంది!"

శ్రీకాంత్ మెరుస్తున్న కళ్ళతో సంధ్యను నిశితంగా చూస్తూ అన్నాడు

'మార్పు నాలో కాదు! నీలో నే! నీ నిగ్రహం మీదే నీకు నమ్మకం పోయింది నా దగ్గర, నీ మనసే నిన్ను భయపెడుతున్నది నీలో ఇదివరకు లేని బలహీనత ప్రవేసించింది నా గురించిన అభిప్రాయాలలో స్థిరనిర్ణయం వున్నన్నాళ్ళూ నా గదిలో నా దగ్గర ఒంటరిగా వుండటానికి నీకు భయం కలగలేదు ఇప్పుడు నీ మనసులో నన్ను గురించిన అభిప్రాయాలలో ఏదో మార్పు వచ్చింది అందుకే ఈ జంకు! అదే నీ భయం! నిన్ను అధికారంతో బలప్రయోగంతో నాదాన్ని చేసుకోవటానికి రెండేళ్ళ కింద ఏ అనుకూల వాతావరణం వుందో ఈ రోజూ అదే వాతావరణం వుంది! అదే అవకాశం వుంది నీ మీద కాంక్ష రెండేళ్ళ క్రింద ఎంత వుందో ఇప్పుడూ అంతే వుంది! భయానికి కారణం నేను కాదు – నువ్వే!"

సంధ్యకు చిరాకుగా వుంది ఆ రోజు మధుతో మాట్లాడితే మధు కూడా ఏవేవో తన వాక్చాతుర్యం అంతా వుపయోగించి అభూత కల్పనలు చేశాడు తను కాదని వాదించలేకపోయింది ఇవ్వాళ శ్రీకాంత్ కూడా తన ఈ స్థితికి తనే కారణమంటున్నాడు

"సరే, ఒప్పుకుంటున్నాను నేనే కారణం! నా మనసే కారణం! మీ దగ్గర వుంటే ఎక్కడ మిమ్మల్ని బాధిస్తానో అని మీ నుంచి దూరంగా పారిపోతున్నాను!"

"నన్ను బాధిస్తున్నావని నేనంటే కదా!"

"వేరే అనాలా! పెళ్ళి చేసుకుని బ్రహ్మచర్యం సాగిస్తున్నారు మీ తల్లి నుంచి మీరు దూరమయ్యారు! నేనిక్కడుండగా ఆవిడ ఇక్కడకు రారు నేనీ ఇంట్లో వున్నన్నాళ్ళూ మీరు పెళ్ళి చేసుకోరు!" సంధ్య గొంతు బొంగురు పోయింది

"నువ్వీ ఇంట్లోంచి వెళ్ళిపోతే పెళ్ళి చేసుకుంటానా! నువ్వీ ఇంటికి రాక ముందు కూడా నేను పెళ్ళి చేసుకోననే చెప్పాను!"

"మరి నన్నెందుకు చేసుకున్నారు!"

శ్రీకాంత్ మెరుస్తున్న కళ్ళతో చిరునవ్వుతో సంధ్యను చూస్తున్నాడు.

"చెప్పండి! నాకు సమాధానం కావాలి!"

శ్రీకాంత్ పెద్దగా నవ్వాడు.

"చెప్పినా నీ కర్థం కాదు!"

"ఎందుకర్థం కాదు! మీరు చెప్పేవి నమ్మను!"

"నేను నాకోసం బతుకుతాను!'

సంధ్య మాట్లాడలేదు చివరికంది-

ఆత్మవంచన! పరవంచన!"

ఈ విషయంలో నేను వాదించదలచుకోలేదు! నువ్వు చెప్ప దలచుకుందంతేనా!" అతని ముఖంలో కోపం స్పష్టంగా కనబడుతున్నది

నా నిర్ణయం చెప్పాను! ఇంకో అభ్యర్థన!"

"ఏమిటది?"

"మీరు పెళ్ళి చేసుకోవాలి!

"ఎందుకు?"

సంధ్య అయోమయంగా చూసింది.

"నా మూలంగా మీ జీవితం పాడైందన్న అపవాదు నా మీద వుండకుండా వుండటానికి, నేను జీవితాంతం ప్రశాంతంగా నిశ్చింతగా వుండటానికి–' నెమ్మదిగా అంది సంధ్య

నిజంగా నేను పెళ్ళి చేసుకుంటే నువ్వు ప్రశాంతంగా నిశ్చింతగా వుండగలవా! ఉండలేవు సంధ్యా!

'నేను వుండగలనో లేదో, పోనీ నా మీద ఈ అపవాదన్నా పోతుంది కదా! కొంచెం తీవ్రంగా అంది

ఈ అపవాదు పోవటానికి నేను మళ్ళీ హైరానాపడి పెళ్ళి చేసుకోకపోతే నువ్వే నా భార్యగా అంగీకరిస్తే సరిపోతుంది కదా! నవ్వు నిండిన గొంతుతో అన్నాడు శ్రీకాంత్

సంధ్య ముఖం ఎర్రబడింది

'నా బతుకు చివరకు ఇన్ని అవమానాలకూ, హేళనలకు గురయింది మీకు నన్ను చూస్తే అంత పరిహాసంగా వుందా! సంధ్య కళ్ళల్లో నీళ్ళు నిండినయి

సారీ! సంధ్యా! నా ఉద్దేశం అదికాదు ఎన్నాళ్ళీ పట్టుదల! సహనానికి కూడా ఒక హద్దుంటుంది కదా!

అదే నేనంటున్నాను! సహనానికి కూడా హద్దుంటుంది ఎన్నాళ్ళు మీరు సహనం వహించినా ఫలితం వుండదు కాబట్టే మీరు వేరే పెళ్ళి చేసుకోండి! నాకు ఈ బంధంలోంచి విముక్తి లభిస్తుంది!

శ్రీకాంత్ దీర్ఘంగా నిట్టూర్చాడు

"ఈ బంధం నుంచి విముక్తి కావాలంటున్నావు! నేను నిన్ను బంధించానా! బంధించినప్పుడు కదా విముక్తి– నావల్ల పొరపాటేదైనా జరిగితే చెప్పు– సరిదిద్దుకోవటానికి ప్రయత్నం చేస్తాను!

'మీవల్ల పొరపాటు జరిగిందని నేననటం లేదు ఎందు కింత చర్చ! మీ మాటే మాట్లాడతాను కాసేపు– నన్నేదో ప్రేమించారనీ, ఆరాధిస్తున్నారనీ– అందరూ అంటున్నారు కదా– పోనీ, నా కోసం మీరు పెళ్ళి చేసుకోలేరా! సంధ్య ఉద్రేకంగా అంది



# రాగసంధ్య

నీ కెందుకంత పట్టుదల! నేను పెళ్ళి చేసుకోను! నీకేం నష్టం!' అంతకంటే ఉద్రేకంగా అన్నాడతను.

'పంతం! నామీదేదో సాధించాలని! నేను మీతో జీవితాన్ని పంచుకోలేను మీలా నటించలేను! మీతో జీవించే అర్హత కూడా నాకు లేదు! మలినమైన ఈ మనసుని మీకెలా అర్పించగలను? సంధ్య కళ్ళు వర్షిస్తున్నాయి

శ్రీకాంత్ లేచి పిట్టగోడ దగ్గర కెళ్ళి చూస్తూ నిలబడ్డాడు

చాలాసేపు సంధ్య మోకాళ్ళ మధ్య తలదూర్చి ఏడుస్తూనే వుంది

శ్రీకాంత్ అక్కడనుంచి రాలేదు ఆమెను అనునయించ లేదు

సంధ్య ఒంటరిగా నిస్సహాయంగా ఏడుస్తున్నది చివరకు శ్రీకాంతే దగ్గర కొచ్చాడు అతను దూరంగా నిలబడి మాట్లాడాడు.

'ఏడవకు? మీ ఆడవాళ్ళకి పిలిస్తే పలుకుతాయి కన్నీళ్ళు! నీ మనసు మలినం, మలినం అని పదే పదే అనుకుంటూ కుమిలిపోతున్నావు నువ్వు! పరిశుభ్రమైన ఆలోచనల్ని రాకుండా అరికడుతున్నావు! మొన్న మధు ఎంతో విడమర్చి చెప్పాడుటకదా! ఏం చెప్పాడో నాకు తెలియదు కాని, నువ్వు కొద్దిగానైనా మారి నీ మనసుని ప్రశాంతత పొందనిస్తావేమోనని ఆశపడ్డాను నీకిక విమోచనం లేదు నీ మనసుని నువ్వు చిత్రవధ చేసుకుంటున్నావు! నీ ఇష్టప్రకారమే చేద్దువుగాని, లే, వెళ్ళి పడుకో!"

అతనికి అంతులేని విరక్తిగా, నీరసంగా వుంది

'మీరందరూ పదే పదే ఒకే విషయాన్ని చెప్పి నన్ను నమ్మించాలని ప్రయత్నం చేస్తున్నారు. నేను మధుని ప్రేమించలేదు అంతరాంతరాల్లో ఎక్కడో మిమ్మల్నే ప్రేమించానని – ఆ విషయాన్ని నేను నమ్మాలనీ మీరంతా విశ్వ ప్రయత్నం చేస్తున్నారు ఆ విషయం నా మనసు అంగీకరించటం లేదు ఇకనుంచీ ఆ వ్యర్థ ప్రయత్నం చెయ్యకండి!" విసురుగా అంటూ లోపలి కెళ్ళిపోయింది సంధ్య

శ్రీకాంత్ అక్కడే కూర్చుండిపోయాడు తెల్లవారింది.

★ ★ ★ ★ ★

బొంబాయి మహా నగరంలో ఒంటరిగా కాలు పెట్టిన సంధ్యకు కొంతసేపు ఊపిరాడలేదు తన ఫ్రెండు సరళ ఇక్కడ పనిచేస్తున్నది. ఆమె లైబ్రేరియన్ ఎప్పుడో కొన్ని సంవత్సరాల క్రితం ఆ విషయం చెప్పింది టెలిఫోను డైరక్టరీలో నంబరు వెదికి ఫోను చేసింది. సరళ అని పేరుగల వాళ్ళెవరూ ఆ లైబ్రరీలో లేరని సమాధానం వచ్చింది ఫోను పెట్టేసి ఆలోచనలో పడ్డది సంధ్య ఇట్లా స్టేషనులో ఎంతసేపు నిలబడాలి! చటుక్కున గుర్తొచ్చింది సంధ్యకు సరళ పెళ్ళి చేసుకుని వెళ్తూ కనబడింది తనకు.

భర్త పేరు మురళీధరరావు ఒకవేళ పెరు మార్చుకుందేమో! మళ్ళీ ఆనంబరుకి డైల్‌చేసింది 'మిసెస్ మురళీధరరావు' అని ఎవరైనా వున్నారా అనడిగింది 'మిసెస్ మురళీధర్' అనేఆవిడ వుందనీ – ఆవిడ ప్రస్తుతం లీవ్‌లో వుందనీ చెప్పాడు అవతల వ్యక్తి అడ్రసు అడిగింది తను ఏదో చెప్పాడు సంధ్యకు ఒక్కముక్క కూడా అర్థంకాలేదు ఫోను పెట్ట బోయే ముందు 'కావాలంటే ఇంటినంబరు నోట్ చేసుకోండి!' అంటూ నంబరు ఇచ్చాడు సంధ్య ఆశగా ఫోను చేసింది అదృష్ట వశాత్తూ సరళ పలికింది. మొదట 'సంధ్య' అంటే గుర్తుపట్ట లేదు తరువాత గుర్తు పట్టి ఆశ్చర్యపోయింది సరళ స్టేషనుకి వచ్చి సంధ్యను ఇంటికి తీసుకు వెళ్ళేసరికి సాయంత్రం నాలుగయింది ఆ పూటకు స్నానం చేసి భోజనం చేసి పడుకుంది సంధ్య తెల్లవారి పది గంటలకి సరళ భర్తను ఆఫీసుకి పంపిన తర్వాత నెమ్మదిగా సంధ్యరాకకు కారణం అడిగింది సరళ ఆ రోజంతా ఎవరో గెస్టు వస్తారని సరళ బయటకు కదలలేదు ఆ గెస్టురాలేదు సంధ్యకూడా మానసికంగా అలసిపోయిందేమో ఆరోజు పూర్తి విశ్రాంతి తీసుకుంది



# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నిగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

## సంగీతంలో పలికే ప్రతి సొంపును వశపరచుకునేలా రూపొందింప బడింది. అందులోని ప్రతి తరంగాన్ని గ్రహించాలిగా మరి!



**ప్రతి అణువూ సంగీతమయమే... మరే ఇతర శబ్దాలు ఉండబోవు.**

**ఆ నాదాలు అలాగే నిలచిపోతాయి**
**ఈ స్త్వైర్ క్యాసెట్‌పై.**
**జపాన్, అమెరికా, యూరోప్ దేశాల్లో స్త్వైర్‌గా పిలువ బడుతున్న క్యాసెట్, ఇండియాలో కోనేరుగా నామాంతరం పొందింది.**

# koneru
## ఆడియో క్యాసెట్లు*

ఎలక్ట్రానిక్స్ రంగంలో జగత్ప్రసిద్ధిని పొంది, పారిశ్రామిక దిట్టగా పేరుగాంచిన స్త్వైర్ వారి అత్యాధునిక సాంకేతిక విజ్ఞానాన్ని కోనేరు క్యాసెట్లలో ఉపయోగించుకొనడమైనది

**కోనేరుకు ఆ ప్రత్యేక ధ్వని తరంగాలు లభించడానికి గల కారణాలు :**

- మాగ్నటిక్ అణువులు టేపంతయు సమానంగా వ్యాపించి ఒకే మూసలో పోసినట్టు నిర్దిష్టంగా రూపొందించిన రూపకల్పన
- నేపథ్యంలోని అతి తక్కువస్థాయి శబ్దతరంగాలను సైతము స్వచ్ఛంగా వినబడేవిధంగా తీర్చిదిద్దిన ప్రత్యేకత
- మార్మోగిపోయే అతి హెచ్చుస్థాయి శబ్ద తరంగాలను సైతము సున్నితంగా గ్రహించుకోగల అసమానత
- రవాణాలో ఏ మాత్రము దెబ్బతినడానికి వీలుగాని కట్టుదిట్టమైన నిర్మాణము
- టేపును సక్రమంగా, సున్నితంగా తిరుగునట్లుచేయు సిలికాన్ చేర్చబడ్డ రోలర్లు
- ప్రత్యేకంగా పోతపోసిన లోహంతో నిర్మించిన సంపూర్ణ భద్రతగల ఫ్రేం నిర్మాణము
- తెరచినపుడు క్యాసెట్ పడిపోకుండ ఆపేందుకు యంత్ర తాళపు సౌకర్యము




తయారుచేయువారు
**శక్తి ఇంజనీరింగ్ కంపెనీ**
ఎలెక్ట్రానిక్స్ డివిజన్
26-36-39 మ్యూజియం రోడ్డు,
విజయవాడ 520 002

*ప్రీ రికార్డెడ్

CLARION/SEC/8616

# రాగసంధ్య

ఎక్కడ మీ గెస్టు? సాయంత్రం కాఫీ తాగుతూ అడిగింది సంధ్య

రావల్సిన మాటే! ఎందుకో రాలేదు?" ఆలోచనగా అంది సరళ

ఆరాత్రి కబుర్లు చెప్పుకుంటూ పడుకున్నారు స్నేహితురాళ్ళిద్దరూ పడుకోబోయే ముందు సంధ్య తనకు కావలసిన యడ్రసుకి ఎట్లా వెళ్ళాలో, ఏ నంబరు బస్సెక్కాలో వివరంగా అడిగి తెలుసుకుంది మర్నాడు సంధ్య లేచేసరికి సరళ హడావుడిగా వంట చేస్తున్నది

ఏం ఇంత తొందర పడుతున్నావు' సంధ్య అడిగింది 'రాత్రి మా గెస్టుగారు వెంచేశారు పది గంటలకు భోజనం సిద్ధంగా వుండాలి! లేకపోతేనా ." నాటకంలో లా చేతులు తిప్పుతూ అంది సరళ

బలే గెస్టే! అధికారం చెలాయించి మరీ చేయించుకునే గెస్టన్నమాట- చూసి తీరవలసిందే! స్నానానికి బయలుదేరుతూ అంది సంధ్య

తనుకూడా తొందరగానే వెళ్ళాలి! భోజనం పెట్టుకు కూర్చుంటే అవదు తనపని అయింతర్వాతే భోజనం తలస్నానం చేసి లేత నీలరంగు జరీ పూలున్న వెంకటగిరి జరీచీర కట్టుకుని తయారయింది సంధ్య ఒత్తుగా, నల్లగా, బారుగావున్న జడ – ఆ చీరకట్టుకున్న తీరు- ఆమె శరీరానికి అమరిన ఆ లేత నలిరంగు – సరళ క్షణంసేపు తన్మయంగా చూసింది సంధ్యను

ఏమిటలా చూస్తున్నావు?' జడ చివరి పాయలు అల్లుకుంటూ అంది సంధ్య

'ఏంలేదు! ఆడదాన్ని – నాకే – నిన్ను నిన్ను కొరికెయ్యాలనీ- ముద్దు పెట్టుకోవాలనీ అనిపిస్తున్నది- ఇక- మీ శ్రీవారికెట్లా వుంటుందా అని" – కొంటెగా అందిసరళ

ఛీ, ఛీ, మరీ అసహ్యంగా మాట్లాడకు ఆయనలాంటి వారు కాదు"–

అంటే–? ఆశ్చర్యం, నవ్వూ మిళితం కాగా అంది సరళ సంధ్య గిరుక్కున వెనుదిరిగింది చెప్పులేసుకుని బయలు దేరింది వెనకనుంచి సరళ అరిచింది జాగ్రత్త– త్వరగా వచ్చేయ్! నేను వస్తానంటే వద్దంటున్నావు'

★ ★ ★ ★ ★

సంధ్య తను రాదల్చుకున్న యింటికి రావటానికి ఎక్కువ కష్టపడలేదు కాలింగ్ బెల్ నొక్కగానే తలుపు తెరుచుకుంది తలుపు ఇవతల సంధ్య, తలుపు లోపల వ్యక్తి ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూస్తూ చేష్టలుడిగి నిలబడి పోయారు లోపలికి వెళ్ళాలని సంధ్యా అనుకోలేదు రమ్మని ఆ వ్యక్తి ఆహ్వానించలేదు చివరికి సంధ్యే చొరవ తీసుకుని లోపలికెళ్ళింది

చాలా సేపు ఇద్దరి మధ్యా మౌనం రాజ్యమేలింది.

"మనోరమా! నన్ను క్షమించు! జరిగిందంతా మర్చిపో!"

అభ్యర్థనగా అంది సంధ్య.

మనోరమ మాట్లాడలేదు

"నేను మనస్ఫూర్తిగా క్షమార్పణ వేడుకుంటున్నాను. నిన్ను మా ఇంటికి వచ్చినప్పుడు అవమానించాం అప్పటి పరిస్థితి అది!"

మనోరమ ముక్కుపుటాలు అదిరినయి

"నేను వెర్రిదాన్ని కాబట్టి మీ ఇంటికొచ్చాను! అసలు ఆ పొగరుబోతు ఇంటికెవరైనా వస్తారా!" కోపంగా అంది మనోరమ

"మనోరమా! ఆవేశపడకు! తెలియక చేసే విషయాలకు శిక్ష తేలిగ్గా వుండాలి! ఆయన తరపున క్షమించమని నిన్ను నేను కోరుకుంటున్నాను!"

మనోరమ పెదిమలు బిగించి కూర్చున్నది

సంధ్య చాలాసేపు మౌనంగా చూస్తూ కూర్చుండి పోయింది. తను చెప్పదల్చుకున్న విషయం ఎట్లా మొదలుపెట్టాలో తెలియటంలేదామెకు!

మనోరమ అసహనంగా సోఫాలో కదుల్తున్నది. ఏదో ముఖ్యమైన పనివుంటేనే గాని ఈమె ఇక్కడికి రాదు! ఏమిటంత ముఖ్యమైనపని తనతో!

నేను అభ్యర్థినై మీ ఇంటికి వచ్చాను! ఉపోద్ఘాతంలా ప్రారంభించింది సంధ్య

మనోరమ కళ్ళెత్తి సంధ్య కళ్ళల్లోకి చూసింది

'మనోరమా! నిజంగా నువ్వాయన్ని ప్రేమిస్తే ఎట్లాగైనా ఆయన జీవితాని కొక మార్గం చూపించు! ఆయన కష్ట సుఖాల్లో భాగం పంచుకో!'

ముందు సంధ్య మాటలకు ఆశ్చర్యపోయినా చివరికి పెద్దగా విరగబడి నవ్వింది మనోరమ

"సంధ్యా! డ్రింక్ చేసి వచ్చావా! నవ్వేసి సంధ్యను నిశితంగా చూస్తూ అంది మనోరమ

సంధ్యకు రక్తం పొంగివచ్చింది

'డ్రింక్ చేసిన వాళ్ళకీ, దేవిరించి వచ్చేవాళ్ళకీ పెద్దగా భేదం లేదులే!

ఇంతకీ విషయవేమిటి?

'తననుంచి నేను దూరంగా పోతున్నాను నేను ఎదురుగా వున్నన్నాళ్ళు తన జీవితం ఇంతే! నా కోసంగా ఆయన బ్రతుకంతా శాపంలా గడవ కూడదు తనకి అనందాన్ని రుచి చూపించగల దానివి నువ్వు! అత్తగారికి కూడా నీమీదే నమ్మకం తన బాగోగులు, మంచి చెడ్డలు, ఆ ఇంటి పరిస్థితులూ తెలిసిన దానివి, పైగా అన్నిటికీమించి తను కావాలనుకున్నదానివి– మనోరమా! ఎట్లాగైనా నువ్వీ బాధ్యతను తీసుకోవాలి!" బ్రతిమాలుతూ అంది సంధ్య

మనోరమ గుండెలు విచిత్రంగా స్పందించినయి ఆరాధనగా కళ్ళు మూసుకుంది అంతలోనే ఏదో గుర్తొచ్చినదానిలా-

"అవునూ! నువ్విక్కడకు వస్తున్నట్టుగా శ్రీకాంత్‌కి తెలుసా!

సంధ్య తల అడ్డంగా తిప్పింది

అట్లా చెప్పు! నీ మొగుడున్నావు చూశావ్! నీ మీద అతనికో గొప్ప ఆరాధన! ప్రపంచంలో ఆడవాళ్ళే కరువన్నట్టు నీ వెంటబడ్డాడు నిన్ను చూచుకుని అతనికి అహంభావం! నువ్వొక పరమ మూర్కురాలివి! అతన్ని నీ కాలి కొనగోటితో నెట్టి పారేశావు! పాపం! 'జగమే మాయా ' పాడుకుంటున్నాడు నీ మొగుడు !'

ఆవేశంగా అంటున్న మనోరమను మధ్యలో నే ఆపింది సంధ్య

మనోరమా! ఈనాడు నీ గమ్మంలో యాచకురాల్నయి వచ్చాననా ఈ తిరస్కారం నా మొగుడి గురించి మాట్లాడే అర్హత నీకు లేదు అతనిమనసివ్వటానికి ఎంత తపస్సు చెయ్యాలి! మామూలు ఆడవాళ్ళ కది సాధ్యంకాదు నువ్వు అతన్ని అర్థం చేసుకుని అతని బ్రతుకులో వెన్నెల కురిపించగల వనుకున్నాను!" కోపం, బాధ – రెండూ నిండిన గొంతుతో అంది సంధ్య

"వెన్నెలేం ఖర్మ! పందు వెన్నెల అమృతం కురింపించగలను! కాని, చెప్తున్నాను గదా! నీ మొగుడు రాతి బొమ్మ అతనిలో చలనంలేదు నువ్వు తప్ప ప్రపంచం లేదంటాడే! అతనితో ఒక రోజా రెండు రోజులా! ఆరు నెలలు సిగ్గు, అభిమానం వదులుకొని తిరిగాను చివరకు నోరు తెరిచి అడిగాను! ఎందుకు? ఆ నీ మొగుడు గొప్ప అందగాడు, అతని గాంభీర్యం, తొణకని ఆ నిశ్చలత – నన్ను ముగ్ధురాల్ని చేసినయి అతను లేకుండా బతకలేననుకున్నాను ఒక్క రోజు, ఒక్క గంట – ఒక చల్లని మాట – అతని నుంచి నేను పొందలేక పోయాను నన్ను తిరస్కరించాడు అవమానించాడు నిర్లక్ష్యం చేశాడు నిస్సహాయంగా ఏడుస్తుంటే మౌనం వహించాడు

'అప్పటి సంగతి వేరు ఇప్పటి సంగతి వేరు!' సంధ్య అంది

"ఏమిటట ఇప్పటి సంగతి! నా మీద విరహంతో వున్నాడా నీ మొగుడు – చూడు తల్లీ! నువ్వు పెళ్ళిదాకా పోతున్నావు! పెళ్ళీ వద్దు – పేరంటం వద్దు! శ్రీకాంత్‌తో ఒక్క రాత్రి గడిపితే చాలు! పెళ్లాం స్థానం వద్దు – నన్నుంచుకుంటాడేమో ఉడిగిరా! నేను హక్కుల కోసం పోట్లాడను! నీ మొగుడికి రకరకాల స్వర్గాలు చూపిస్తాను! వెళ్ళు – ఆ మొండి మనిషి – నన్ను వుంచుకుంటాడేమో ఉడిగి పర్మిషను తీసుకునిరా –

# సుభాషితాలు

యథా గజః పరిశ్రాంతః
చాయా మాశ్రిత్య విశ్రమేత్'
విశ్రమ్య చద్రుమం హన్యా –
తథా నీచః స్వమాశ్రయమ్''




అలసిపోయిన ఏనుగు, చెట్టు నీడలో అలసట తీర్చుకొని పిదప ఆ చెట్టునే నాశం చేయునట్లు నీచుడు ఆశ్రయమిచ్చిన మంచివారిని గూడా నాశం చేస్తాడు.

యస్యాస్తి విత్తం సనరః కులీనః
సపండితః సశ్రుతవాన్ గుణజ్ఞః'
సఏవ వక్తా సచ దర్శనీయః
సర్వే గుణాః కాంచన మాశ్రయంతి''




ధనవంతుడే సత్కులంలో పుట్టిన వాడౌతాడు వాడే పండితుడు, వాడే శాస్త్రజ్ఞుడు, వాడే గుణాల నెరిగినవాడు, వాడే మాటకారి, వాడే చూడదగిన వాడు. (అందగాడు) అన్ని గుణాలు ధనాన్నే ఆశ్రయిస్తాయి. ధనవంతునే అందరూ అన్ని విధాలా గొప్ప చేసి గౌరవిస్తారని భావము.

–ఆయుర్వేద శిరోమణి రాజ రాజేశ్వరశర్మ

# గది - వీధి

— డా. సి. నారాయణరెడ్డి

వీధికి వెర్రి
కిటికీ చువ్వల్ని పట్టుకుని
గదిలోక దూరాలని
గదికి పిచ్చి
కిటికీ చువ్వల్ని తెంచుకుని
వీధిలోక దూకాలని
సగటు బతుక్కి రెండు కళ్ళు
గదీ వీధీ
గదిలో ఉన్నంత వరకే కళ్ళు
దాటితే అవి కాళ్ళు
వీధిలో పడితే చాలు
అరుస్తాయి కాళ్ళు
జన సముద్రాల్ని అంటించుకుని
ఆలోచనల పురిటిల్లు గది
ఆచరణల రణస్థలి వీధి

# రాగసంధ్య

సంధ్యకు మనోరమను చూస్తుంటే ఎక్కడలేని అసహ్యం, జుగుప్స, కలిగినయి మూర్తీభవించిన పచ్చి వ్యభిచారం! ఒక ఆడది ఈ రకంగా కూడా మాట్లాడగలదా! ఇంకొక్క క్షణం అక్కడ వుంటే ఇంకా ఎంత భయంకరమైన మాటలు వినాలో! ఈ విషయం శ్రీకాంత్‌కి తెలిస్తే తన నీ జన్మలో క్షమించదు! ఒక్క ఉదుటున లేచింది సంధ్య

ఏం నీ మొగుడ్ని అడిగి వస్తావా!' వ్యంగ్యంగా అంది మనోరమ

చీ! నువ్వొక మనిషివా! నీతో మాట్లాడితేనే పాపం!" చీదరగా తెరిచివున్న తలుపుల వైపు పరుగుతీసింది సంధ్య

గుమ్మం దాటి బయటకు వచ్చిన సంధ్య కళ్ళు వేడల్పు చేసుకుని చూస్తూ నిలబడిపోయింది తెల్లని షర్టు, తెల్లని ప్యాంటుతో స్వచ్ఛంగా, నిర్మలంగా – కన్నుల నిండా కనబడుతున్న ఆ మూర్తిని చూసి సంధ్యకు నాలుక పిడచకట్టుకు పోయింది! శ్రీకాంత్ ఇక్కడకెలా వచ్చాడు! తనిక్కడికి వస్తున్నట్టు ఎలా తెలుసు! తమ సంభాషణంతా విన్నాడా! పైన ఆలోచించలేక పోయింది సంధ్య ఆమె తలలో రక్తనాళాలు చల్లబడిపోతున్నట్లు, వేగంగా కొట్టుకుంటున్న గుండెలు ఆగిపోతున్నట్లు అనిపించసాగింది మరుక్షణం ఒక్కడుగు ముందుకు వేసి ఒరిగిపోయింది సంధ్య పడిపోకుండా ఒకే ఊపుతో ముందుకొచ్చి అందుకున్నాడు శ్రీకాంత్

సంధ్యను అపురూపంగా పొదివి పట్టుకుని గుమ్మంలో నిలబడిన మనోరమను చూస్తూ – నేనూ, నా భార్యా నిన్ను చూసిన దోషానికి బట్టలు తడుపుకుని తలస్నానం చెయ్యాలి – చీ – నీదీ ఒక జన్మేనా!' అంటూ సంధ్యను కారులో ఫ్రంటు సీటులో పడుకోబెట్టి ఆమెను ఒక చేత్తో తన ఒళ్ళోకి లాక్కుని కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయాడు మనోరమ వెళ్ళిపోతున్న కారును చూస్తూ నిలబడిపోయింది

(ఇంకా ఉంది)

## హైదరాబాద్ నోట్‌బుక్

## బళ్లారి భీష్మని సంస్మరణ :-

1924 లో గాంధీజీ యావద్భారత పర్యటన చేస్తూ బళ్లారికి వచ్చారు ఆంధ్ర నాటక పితా మహ ధర్మవరం రామకృష్ణమాచార్యుల బంగళా కాంపౌండులో గాంధీజీకి స్వాగతం ఏర్పాటు చేశారు ఊరంతా చరఖా తోరణాలతో, భారత్ మాతాకీ జై నినాదాలతో కళకళలాడింది గాంధీజీ మెట్టిన స్థలం, ప్రసంగించిన స్థలం మహా పవిత్రమని భావించే రోజులు గనుక బంగాళా కాంపౌండ్ అదృష్టానికి ఊరివాళ్లంతా అసూయ పడ్డారు గాంధీజీకి స్వాగత మిచ్చే మహాధ్వరంలో తల మునుకలై వున్నది బంగళాలోని రామ కృష్ణమాచార్యుల పరివారమంతా వారిలో ఆసుల్లో కండెలలాగ తిరుగుతున్నవారు రామ కృష్ణమా చార్యుల కుమారులలో ఇద్దరు – భోగీంద్ర కృష్ణమాచార్యులు, వేణుగోపాలాచార్యులు భోగి కాశీ విశ్వ విద్యాలయంలో ఇంజనీరింగ్ పూర్తిచేసి వచ్చారు, వేణుగోపాలాచార్యులు న్యాయశాస్త్ర పట్టభద్రులై అప్పుడే ప్రాక్టీసు ప్రారంభించారు

వారిద్దరినీ గాంధీజీ మహానందంతో ఆశీర్వదించారు అప్పుడు చూచాను శ్రీ వేణయ్యను తొలిసారిగా అప్పటినుంచి ఆరు దశాబ్దాలలో ఆయన ఎంతగా ఎదిగిపోయాడు! ఎన్ని సంస్థలతో ఆయనకు సంబంధం! ఆయన సేవ ఎన్ని కుప్పలు కుప్పలుగా పేరుకొని పోయిందో! వేణయ్య ఆంధ్ర నాటక పితామహుని చివరి కుమారులు 1900 మార్చి 22 న బళ్లారిలో జన్మించారు 1920 లో మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి ఎ ముగించి, 1922 లో న్యాయశాస్త్ర పట్టభద్రులై మామగారైన శ్రీ బళ్లారి రాఘువవద్ద ఆరేడు సంవత్సరాలు పనిచేసి, 1952 వరకు మద్రాసు హైకోర్టు న్యాయవాదిగా ఉన్నారు 1953 లో బళ్లారి మైసూరులో లీనమయింది. శ్రీ వేణయ్య మైసూరు హైకోర్టు అడ్వకేట్ అయ్యారు

బొంబాయి హైకోర్టులోను, సుప్రీం కోర్టులోను పెక్కు అభియోగాలలో వాదించారు ఈ అరవై ఏళ్లలోను ఆయనకు పెక్కు కళా సాంస్కృతిక, సాహిత్య, ధర్మ సంస్థలతో సంబంధం కలిగింది రాఘవ కలామందిర్, స్వామీ రామకృష్ణ వివేకానంద కేంద్రం, మునిసిపల్ హైస్కూలు పాత విద్యార్థుల సంఘం, బాయ్ స్కౌట్స్ మున్నగునవి ఆయన నీలగిరి జిల్లా కూనూరులో సమగ్ర శిక్షణ పొందిన వుడ్‌బాడ్జ్ స్కౌట్ స్కౌట్ కమిషనర్‌గాను, పిదప భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్ డివిజనల్ కమిషనరుగాను వున్నారు ఆంధ్ర కర్నాటక ప్రాంతాలలోని పెక్కు సాంస్కృతిక సంఘాలకు అధ్యక్షులుగాను వున్నారు 1966 జనవరిలో కొలంబోలో జరిగిన దక్షిణాసియా న్యాయవాదుల మహాసభ ప్రాంతీయ సమావేశంలో కర్ణాటక



"బళ్లారి భీష్మ"
శ్రీ ధర్మవరం
వేణుగోపాలాచార్యులు
(84వ ఏట)

ప్రతినిధిగా పాల్గొని, తమ అమూల్యమైన సూచనలతో కర్నాటక రాష్ట్రానికి, భారత దేశానికి ఎంతో కీర్తి తెచ్చారు ఈ సమావేశంలో ఆసియా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ సుప్రీం కోర్ట్ ప్రతినిధులు, ప్రీవీ కౌన్సిల్ ప్రతినిధులు పాల్గొన్నారు వారికి దౌత్యాధికారుల హోదా ఇచ్చారు శ్రీ వేణయ్య చిన్ననాటినుంచే దేశభక్తి ప్రపూర్ణులు గదా 1922 నుంచి – గాంధీజీ స్వదేశీ వస్త్రధారణ నినాదం ఇచ్చినప్పటినుంచి - స్వయంగా వడికిన ఖద్దరు వస్త్రాలు ధరించేవారు క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టయి కారాగార శిక్ష అనుభవించారు పెక్కు ఉద్యమాలకు, పెక్కు సంస్థలకు, పెక్కు సత్కార్యాలకూ పట్టుగొమ్మ అయిన శ్రీ వేణయ్యను 'బళ్లారి భీష్మ' అని బళ్లారి పౌరులు సత్కరించ డంలో ఆశ్చర్యమేముంది? నేను 'పరిశోధన' పత్రిక ఆంధ్ర నాటక పితామహ సంచిక కోసం ఆయన వ్యాసం కోరాను వెంటనే తండ్రిగారు ఆంధ్ర నాటక పితామహులను గురించి తమ చిన్న నాటి అనుభవాలు చక్కగా వ్రాసి పంపారు 1984 ఏప్రిల్‌లో పరమపదించేవరకూ కూడ నిరంతరం పనిలోనే వ్యగ్రులై వుండేవారు చిన్నపిల్లలంటే ఆయనకు చాల ప్రేమ వారు దైవసములని తరచు అనేవారు రవీంద్ర వివేకానందుల రచనలు వాచో విధేయం మొదటి పని, తర్వాతే భార్యాపిల్లల సంగతి అందుకే ఆయన సతీమణి శ్రీమతి లక్ష్మీదేవమ్మ తరచు అనేవారు "కోర్టునే పెళ్ళి చేసుకుంటే బాగుండేదికదా!" అని నేటి సినిమాలంటే పడేదికాదు ఆయనకు శాస్త్రీయ సంగీతం చాల ఇష్టం టెన్నిస్, ఫుట్‌బాల్ ఆటలలో మొనగాడు బళ్లారి వ్యాయామశాలను బాగా అభివృద్ధికి తెచ్చారు యోగాసనాలు ప్రచారం చేశారు 1984 ఏప్రిల్ 7న పరమపదించారు ఈనెల 7న ఆయన కుమార్తె డాక్టర్ మీరాబాయి (నీలాపర్ ఆస్పత్రిలో సివిల్ సర్జన్) ఇంట్లో (శ్యామ్ నగర్) జరిగిన ప్రథమ వర్ధంతి సభలో పలువురు 'బళ్లారి భీష్ముని' గుణగణాలు కీర్తించారు తెలుగువాడు ఏ ప్రాంతం మెట్టినా, అక్కడి వారితో కలిసి పనిచేసి కీర్తిని గుట్టలుగా పోశాడు ఆంధ్ర నాటక పితామహుని కుటుంబంవారు నాడూ, నేడూ తెలుగు వారికి, ఇతరులకూ చేసిన, చేస్తున్న సేవ అపారం శ్రీ వేణుగోపాలాచార్యుల జీవితం నేటి యువకులకు ఆదర్శం కావాలి

**ఉపశ్రుతి:-**

ఎస్ టి (షెడ్యూల్డ్ కాస్ట్)లు కావాలన్నారు నేను దరఖాస్తు పెట్టాను నాకు ఉద్యోగం రాలేదండీ! – అని అన్నారు నాతో ఒక హరిజన మిత్రుడు వెర్రివాడా, ఎస్ టి అంటే సేమ్ కాస్ట్ (సమాన కులుడు) అని అర్థం – అని వ్యాఖ్యానించారు ప్రక్కన వున్న ఒక పత్రికారచయిత

తిరుమల రామచంద్ర.

Printed and Published for Nageswara Rao Estates Private Ltd , by S Nageswara Rao at the
Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna,
Phones P B X 61247, 61248 & 75667

# కన్న బిడ్డల్ని విక్రయించే కసాయి తండ్రి!

హైదరాబాదులో నాగరాజు అనే వొకతను తాను డబ్బు సంపాదించడానికి తన మొదటి భార్యకు పుట్టిన తొమ్మండుగురు పిల్లలలో శ్రీనివాసులు రవి అనే మగపిల్లలను రెండో భార్యకు పుట్టిన ఒకేఒక్క ఆడపిల్ల విజయలక్ష్మిని ఎవరికో అమ్మేశాడట ఆ వ్యక్తి పిల్లల్ని కొని అవిటివారిని చేసి బొంబాయిలో బిక్షగాళ్ళుగా చేసి వారి ద్వారా సంపాదించుకునేవాడట వాడు శ్రీనివాసులుదో కాలు రవిదో చేయి నరికించేశాడట ఆడపిల్లల్ని మాత్రం ఏమీ చేయకుండా ముస్తైత్తొచ్చి వయసొచ్చాక వ్యబిచార గృహాలకు అమ్మేస్తాడట విజయలక్ష్మి ధైర్యం చేసి వాడి చెఱ నుంచి పారిపోయి మళ్ళీ యిల్లు చేరితే తండ్రి తిరిగి అమ్మేస్తాడని బయపడి మంగంపేట చేరి ఎవరింట్లోనో పని చేసుకుని బ్రతుకుతోందట

# అర్ధ రూపాయి కోసం అసువులు బాసిన రిక్షా డ్రైవర్!

హైదరాబాదుకు చెందిన ఓ మహిళ రిక్షాలో రామచంద్రానగరుకు రిక్షాలో వెళ్ళి మాట్లాడుకున్న ప్రకారం రెండున్నర రూపాయలిస్తే రిక్షావాడు అబ్దుల్ లతీఫ్ మరో అర్ధ రూపాయి ఎక్కువిమ్మన్నాడట ఆవిడ యివ్వననేసరికది పోట్లాటయ్యిందట ఆమె కొడుకు రజాక్‌ఖాన్ ఆవేశంలో ఆ రిక్షావానిని సాచోటి కొట్టేసరికాతడు స్పృహ తప్పి నేలను కరుచుకుని ఆసుపత్రికి తీసుకెళ్ళేలోగా చనిపోయాడట

# లాస్‌ఏంజిల్స్‌లో పొగ తాగడంపై ఆంక్షలు!

లాస్‌ఏంజలిస్‌లో పొగ త్రాగుడుమీద ఆంక్షలు విదించారట ఐదుగురు కలిసి కూర్చునే చోట లిఫ్టులలోను విశ్రాంతి గృహాలలోను బోజనశాలలోను పొగ త్రాగ వీలులేదని ఒక రూలు విదించారట




# మోసగించిన ప్రియుడిపై దావా!

మదురకు చెందిన గోరీపాలయానికి చెందిన 20 ఏళ్ళ కాళియమ్మ మదుర కోర్టులో తాను గర్భిణిననీ ఆ గర్భానికి సుబ్రహ్మణ్యం అనే యువకుడు కారణమనీ నివేదించిందట తనను ఆతడు పెళ్ళి చేసకుంటానని నూటొక్క శపథాలు చేశాడనీ ఆనక వైఘై నది ఆనకట్ట చూడ్డానికి సరదాగా వెళ్ళి అక్కడి లాడ్జిలో తన తనువు తాను ఆతనికి అతని ప్రేరణవల్ల అర్పించాననీ ఆ తరువాత తాను గర్భిణినని తెలిశాక ఆతడు ముఖం చాటు వెయ్యనారంబించాడని ఆమె చెప్పిందట ఈ కేసును మాజిస్ట్రేటు పరిశీలనకి వొప్పుకున్నారట

# మోజు తీర్చలేని కోడలు ఆత్మహత్య!

సేలం అరిసిపాలయానికి చెందిన 19 ఏళ్ళ సుమతి మామగారు ఇరుళన్ తన కోడలు మీద ఆశపడి ఆమె వెనకాలే తిరుగుతూ జడ పీకడం పిరుదుల మీద కొట్టడం వంటి సరసాలారంబించాడట అదేమిటంటే నీమీద నాకు ఆశగా వుంది అబ్బాయి లేనప్పుడు అనుభవించుదామా అని అన్నాట్ట ఈ విషయం తన మొగుడు రత్నానికి చెప్తే ఆతను నవ్వి ఏదో పెద్దవాడు ఆశ పడితే తీర్చకపోయావా! ఈమాత్రం దానికి రాద్ధాంతమేమిటి అన్నాట్ట దాంతో నిశ్చేష్టురాలయిన సుమతి తేరుకుని తన పుట్టింటికి వెళ్ళిపోయిందట అక్కడ తన తండ్రి ఆర్థిక పరిస్థితి సరిగా లేక ఏం చెయ్యాలో తెలీని స్థితిలో ఆమె భర్త వచ్చి నాది తప్పయింది నువ్వేమంటావో అని అలా అన్నాను నాతో వచ్చెయ్ అని తీసుకువెళ్ళి అక్కడ మా నాన్న యిష్టానికి లొంగకపోయావో చంపుతానని బెదిరించాట్ట దాంతో ఆమె విషం త్రాగి ఆత్మహత్య చేసుకుందట

# కల్లు కుండల్లో గాజు పెంకులు!

పొదలకూరు గ్రామానికి చెందిన కల్లు గీసేవారు తమ కల్లు కుండలను త్రాగుబోతు దొంగలు ఖాళీలు చేస్తున్నారని వారి ఆటలు పట్టించడానికి తాటి చెట్లకు కట్టిన కుండలలో గాజు పెంకులు పోశారట ఇది తెలీని దొంగలు ఆ కల్లు త్రాగేసరికి గాజు పెంకులు లోపలకు పోయి జీర్ణకోశము ప్రేవులూ తెగి చనిపోయారట

# భారతీయ రైల్వేల ఘనత!

బారతప్రభుత్వపు రైల్వే శాఖలలో సుమారు 18 లక్షల మంది వుద్యోగాలు చేస్తున్నారట రైల్వే పట్టాల పొడవు 61 వేల కిలో మీటర్లట మొత్తం దేశంలో 7 వేల స్టేషనులున్నాయట ఈ రైళ్ళు చేసే ప్రయాణం 35 సార్లు బూప్రదక్షిణం చేసినంతట ఈ విషయం రైల్వే సహాయ మంత్రి మాదవరావు సిందియా అన్నారట

# భార్య తల నరికిన భర్త!

కర్నాటకకు చెందిన చెన్న ఎసన్న అనే ఆయనకు ఆర్నెలల క్రితం వివాహమయింరిదట ఈయన హిందుస్థాన్ పెట్రోలియం కార్పొరేషన్‌లో పని చేస్తున్నారట ఇల్లరికం వుంటున్న చెన్నబసన్న తన బార్య వైఖరి నచ్చక ఆమెను హెచ్చరించేవాడట ఆమె కోసం తరుచు యిద్దరు మగవాళ్ళు వచ్చేవారట వారితో ఆమె చాలా ఇదిగా వుండేదట అదేమంటే నేను 21వ శతాబ్దంలో ఉన్నాను నా యిష్టం నాది అన్నదట అత్తగారితో చెప్తే ఆమె కూడా హవుదు అందట కన్నడంలో ఇహ వేరే ఏం చెయ్యాలో తోచక ఆ చెన్నబసన్న నిద్రపోతున్న తన బార్య విజయకుమారి తల నరికి వేరు చేసి ఆనక పోలీసులకు లొంగిపోయాడట ☐



టెలిఫోన్ మొట్టికాయలు
ఉష విశ్వనాథ్




హలో! హలో! నెంబర్ దొరకడం లేదు......
199కి అడుగు!




199 దొరకడం లేదు.. ఎవర్ని అడగాలి?




హలో! విజయవాడ కాల్ బుక్ చేసి . గంట అయింది...
విజయవాడ లైన్సు ఖాళీ లేవు!




హలో! హైదరాబాద్ కాల్ బుక్ చేసి మూడు గంటలు దాటింది...
లైన్స్... అవుటాఫ్ ఆర్డర్!




మద్రాసు లైన్స్ అవుటాఫ్ ఆర్డర్....
మానిటర్ కావాలా? అవుటాఫ్ ఆర్డర్...
సూపర్నెంట్.. అవుటాఫ్ స్టేషన్....
సారీ... అవుటాఫ్ ఆర్డర్........
కథలు




ఏమండీ! మిమ్మల్నే!
సారీ.. అవుటాఫ్ ఆర్డర్!!
కథలు




టెలిఫోన్ బిల్ సెక్షనా? ఎప్పుడూ 300 అయ్యే మా ఫోన్ బిల్లు 3000 అయింది! ఏం చెయ్యమంటారు?
ముందు.. మూడువేలూ కట్టేయండి! తర్వాత కంప్లయింట్ పెట్టండి! ఆలోచిస్తాం!

# "శ్రమ... ఫలితం"

## పాలగిరి వేణు

కృష్ణా ఎక్స్‌ప్రెస్ కదిలింది

వెళ్తూనే నాన్నగారి కెలా వుండేది ఫోన్ చేయండి

అలాగే'

మొగల్రాజపురం ప్లాటు గురించి మరిచిపోకేం

అబ్బే'

రైలు స్పీడందుకొంది అన్నయ్యకు టా టా చెప్పేశాను పార్కింగ్ లోనుండి కారు బయటకు తీశాను పూర్తిగా తెల్లారినా మంచుతో ముసుగేసినట్లుంది అదో చీకటిలా' వీధిల్లో లైట్లు మాత్రం బ్రహ్మాండంగా వెలుగుతున్నాయి

రాణీగంజ్‌దాటి ట్యాంకు బండ్ వైపు పరుగెత్తుతోంది కారు హుస్సేన్ సాగర్‌పై మంచు దట్టంగా వుంది బండ్ మీద కూడాను సోడియం లైట్లతో రోడ్డంతా వెలుగు వింత శోభ మంచుతోబాటు కురుస్తోంది చిరుచలిగాలి సన్నగా వణుకు కేస్ లోనుంచి సిగరెట్ తీసి వెలిగించాను మనసంతా హుషారుగా వుంది

కారు ఒక్కసారిగా పెద్ద జర్క్ యిచ్చింది ఇంజన్ ఆగిపోయింది కారు దిగి చూశాను బోయినెట్ తీసి చూశాను ఏమీ అర్థం కావటంలేదు ఎలా జర్క్ వచ్చిందో తెలియదు స్టార్ట్ చేయబోయాను సెల్ఫ్ స్టార్టర్ పని చేయడం లేదు ఎవరైనా కారు తోస్తే బావుణ్ను టాంకుబండ్ మీద పలచగా జనం అక్కడక్కడ ఎవరైనా కూలీ దొరికితే బావుణ్ను అంతో యింత పడేసి లిబర్టీ టాకీస్ దగ్గరున్న మెకానిక్ షెడ్‌కు చేర్చేస్తే అంతా మెకానిక్ చూసుకుంటాడు ఇలా రోడ్డుమీద కారు అర్థాంతంగా వదిలేసి ఏ ఆటో పట్టుకుని వెళ్ళి మెకానిక్‌ను తీసుకు వస్తే అంతవరకు ఎలాటి కాపలా లేకుండా రోడ్డు మీద కారు వదిలేయటమే' అమ్మో'' ఈ రోజుల్లో ?

అటు యిటూ చూశాను

పేవ్‌మెంట్ బెంచీమీద ఎవరో కూర్చుని వున్నారు నిండుగా దుప్పటి కప్పుకొన్నాడు




అతడి దగ్గర కెళ్లాను కారు కొంతసేపు తోస్తే డబ్బు లిస్తానని చెప్పాను అతడు వెంటనే అంగీరించాడు ఆ బెంచీ మీదే ఎవరో పదహేనేళ్ళకుర్రాడు పడుకుని వున్నాడు వాణ్ణి కూడ లేపి తీసుకొచ్చాడు ఆ దుప్పటి మనిషి

నేను స్టీరింగ్ ముందు కూచున్నాను

కారు కదులుతోంది వాళ్లిద్దరూ తోస్తూనే వున్నారు అర పర్లాంగు తోశాక ఓ రెండు నిముషాలు విశ్రాంతి తీసుకున్నారు బాగా అలసినట్లుంది

మళ్ళీ తోపుడు మొదలు ఇంకో అరపర్లాంగు ఉన్నట్లుండి ఏదో క్యాజువల్‌గా సెల్ఫ్ స్టార్టర్ వేసి చూశాను స్టార్ట్ అయింది అదేంటో మరి ఇందాక ఎందుకు పనిచేయలేదో? ఇప్పుడెందుకు పనిచేస్తోందో తెలియడం లేదు

ఇంజన్ ఆప్ చేయకుండా కారు దిగాను

వాళ్ళిద్దరూ చెమటతో తడిసిపోయి వున్నారు కుర్రాడైతే ఆయాసంతో రొప్పుతున్నాడు ఆ పెద్ద మనిషి దుప్పటితో నే చెమటను తుడుచుకుంటున్నాడు కాని నా కెందుకో అతడు ఎక్కువ శ్రమ పడినట్లు అనిపించింది పర్స్ తీసి అందులోనుండి ఓ ఐదు రూపాయల నోటును బయటకు లాగాను

దుప్పటి మనిషికి యిచ్చాను అతడు తృప్తిగా అందుకున్నాడు

మరి నాకో?

ఆ కుర్రాడి ప్రశ్న నాకు ఆశ్చర్యం కలిగించింది

మీ రిద్దరూ ఒకటి కాదా?

ఇత డెవరో నాకు తెలీదు కారు తోయమంటే ఏదో యింత యిస్తారు కదా అని వచ్చా' అంటూ ఆ కుర్రాడు చిరిగిన పొడుగాటి షర్టుతోనే ముఖాన్ని తుడుచుకుంటూ

దుప్పటి మనిషి వైపు చూశాను

నిజంగా కారు తోసేందుకు తోడుగా తెచ్చుకున్నాను అంతేగాని యీ కుర్రాడితో నాకు ఏలాంటి సంబంధం లేదు

ఇంజన్ మోత వినబడుతూనే వుంది ఏ నిముషంలో ఆగిపోతుందో తెలియదు అందులో

పెట్రోల్ ఖర్చు కూడాను

పోనీద్దూ! పాపం కుఱ్ఱాడు ఎంతో కష్టపడి తోశాడు వీడికి ఓ రెండు యిస్తే సరిపోతుంది అని పర్స్‌లోంచి రెండు రూపాయల నోటును తీసి కుఱ్ఱాడికి యిచ్చాను నిజంగా చెప్పాలంటే జాలిపడే యిచ్చాను

అదేంటి రెండు యిస్తున్నారు? అన్నాడు కరుగ్గా కుఱ్ర డు

ఎంతివ్వాలేమిటి? అంటూ ఆశ్చర్య పోవడం నావంతైయింది

నాక్కూడా ఐదే యివ్వాలి

ఎందుకని?

ఇతడెంత కష్టపడ్డాడో అంత కష్టం నేను కూడా పడ్డా!

అంటే!

తన వయసుకు ఎంత శక్తి ఖర్చుపెట్టాడో అంతే శక్తి నా వయిసుకు తగ్గట్టు నేనూ ఖర్చు పెట్టాను నిజంగా నేనే ఎక్కువ కష్టపడ్డా! కుఱ్ఱాడు చిన్న వాడైనా చాలా తెలివిగా సమయస్ఫూర్తిగా మాట్లాడుతున్నాడు అయినా ఫర్లాంగు తోపుడుకు పది రూపాయలు ఖర్చు పెట్టాలంటే నాకు కొంత బాధగానే వుంది పర్సులోంచి యింకో రూపాయి బిళ్ళ తీసిచ్చాను పుచ్చుకోలేదు

ఇస్తే ఐదివ్వండి లేకపోతే యీ రెండు కూడ నాక్కొద్దు

ఇవ్వకపోతే ఏం చేస్తావ్? కొంచెం కర్కశంగా అన్నాను

మిమ్మల్ని అడగటం బుద్ధి తక్కువ నన్ను లేపి తీసుకు వచ్చింది యీ పెద్ద మనిషి యితడు నాకు డబ్బు లివ్వాలి అంటూ ఆ కుఱ్ఱాడు నా వైపు అదోలా చూసి తన దృష్టిని ఆ దుప్పటి మనిషి వైపు నిలిపాడు ఈసారి దుప్పటి మనిషి ఆశ్చర్యపోవడం అతడి వంతు అయింది

నేనెందుకివ్వాలి ? నా కారు కాదుగా!

మీరు నాతో కారు ఎందుకు తోయించారు శ్రమకు తగ్గట్టు పలితం యిప్పించలేక పోతున్నారు

కారు తోస్తే డబ్బు లొస్తాయని ఎలా అనుకుంటావు ఏదో సాయం చేస్తున్నట్టు ఎందుకు అనుకోవు అంటూ దుప్పటి మనిషి వాదిస్తున్నాడు

మా వైపు రోడ్డు మీద వెళ్ళే జనం అదోలా చూసి పోతున్నారు నిజంగా చెప్పాలంటే యింకో రెండు యిచ్చి యీ వాతావరణంనుండి బయట పడాలని వుంది

మళ్ళీ పర్స్ తీశాను రూపాయి బిళ్ళకు యింకో రెండు రూపాయల నోటు కలిపి ఆ కుఱ్ఱాడికి యిచ్చాను కుఱ్ఱాడి ముఖంలో సంతోషం వెలిసింది

థ్యాంకూ సార్! అంటూ ఆ కుఱ్ఱాడు వెళ్ళిపోతూంటే దుప్పటి మనిషి పిలిచాడు

వెల్ డన్ మై బాయ్! బాగా వాదించావ్! ఈ ఐదు కూడా నీవే వుంచుకో! అంటూ యిందాక నే నిచ్చిన ఐదు నోటును కుఱ్ఱాడికి యివ్వబోయాడు

క్షమించండి సార్! అది మీ శ్రమకు తగిన పారితోషికం ఇది నా శ్రమకు తగిన ఫలితం విలువాను మీ ఐదు మీరే వుంచుకోండి నాకు అఖ్ఖర్లేదు 'వస్తా సార్!' గుడ్ బై అంటూ ఆ కుఱ్ఱాడు వడి వడిగా అడుగులేసుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు వెనక్కి తిరిగి చూడకుండా !

ఇంతలో మా ముందు బెంజ్ కారు వచ్చి ఆగింది అందులోనుండి డ్రైవర్ దిగి కారు వెనక తలుపు తెరిచి నిలబడ్డాడు ఎంతో వినయంగా

దుప్పటి మనిషి దుప్పటి కాదు ఖరీదైన ఓ సిల్కు శాలువా భుజమ్మీదకు లాక్కొని నేనిచ్చిన ఐదు రూపాయల నోటును ఒక్కసారి ముద్దెట్టుకుని శ్రమకు తగిన పారితోషికం అంటూ తన జేబులో భద్రంగా వుంచుకున్నాడు

థాంక్యూ! థాంక్యూ!! అంటూ నా చేయిని మృదువుగా స్పృశించి కారెక్కి వెళ్ళిపోయాడు

అతడు హైదరాబాద్‌లో పెద్ద బిజినెస్ మాగ్నెట్ రమేష్ చౌదరి ఎంతో ఆశ్చర్యపోయ...

శ్రమకు తగిన పారితోషికం శ్రమకు తగిన పలితం నేను సరిగా అర్థం చేసుకోనేలోపుగా

నా కారు యింజన్ మళ్ళీ ఆగిపోయింది □



# ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఛాయా చిత్రాల పోటీ!

(ఫొటోగ్రఫీ పోటీ)

## మొత్తం బహుమతులు రు. 3000

**మొదటి బహుమతి రు. 1000**

**రెండవ బహుమతి రు. 750**

**మూడవ బహుమతి రు. 500**

**ఒక్కొక్కటీ రు. 250 చొప్పున మూడు ప్రత్యేక బహుమతులు**



### నిబంధనలు

1. పోటీకి నలుపు-తెలుపు చిత్రాలనే పంపాలి. రంగుల చిత్రాలు పంపరాదు. ఛాయా చిత్రాలు తెలుగు సంస్కృతిని ప్రతిబింబింప చేసేవిగా ఉంటే మంచిది. ప్రకృతి దృశ్యాలని కూడా పంపవచ్చు.
2. ఛాయా చిత్రాల సైజు 8'' × 6''కి మించకూడదు. పోటీకి ఒక్కొక్కరు 3 చిత్రాలకన్నా ఎక్కువ పంపరాదు.
3. పోటీకి పంపే ప్రతి ఛాయా చిత్రం వెనుక వైపు అది తాము స్వయంగా తీసినదేనని హామీ రాస్తూ దానికి సంబంధించిన సాంకేతిక వివరాలని పేర్కొనడం అవసరం.
4. పోటీలో బహుమతి పొందని ఛాయా చిత్రాలని తిప్పి పంపగోరేవారు వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరిచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపడం సాధ్యం కాదు.
5. బహుమతి పొందని ఛాయా చిత్రాలని తిప్పిపంపే విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోడం జరుగుతుంది. కానీ వాటి విషయంలో ఎలాంటి బాధ్యతని స్వీకరించటానికి వీలుకాదు.
6. పోటీకి పంపే ఛాయా చిత్రాలు జూన్ 15వ తేదికి మా కార్యాలయానికి అందాలి. ఆ తర్వాత వచ్చే వాటిని స్వీకరించడం జరగదు.
7. పోటీకి పంపే ఛాయా చిత్రాలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ—520003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో ''ఛాయా చిత్రాల పోటీకి'' అని స్పష్టంగా రాయాలి.
8. పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే పోటీలో పాల్గొనే వారందరూ దానికి బద్ధులై ఉండాలి

— సంపాదకుడు

# ‘సంసారం చల్లనిదయితే సంతోషం సాగరమవును..’

అందమయిన ఒక వస్తువు అనవరతం ఆనందం కల్గిస్తుందని ఒక మహాకవి అన్నాడు నిజానికి,పరిమిత కుటుంబాలతో సంసారాలు చల్లగా ఉంటే ఆనందానికి హద్దులుండవు_ఆనందం అర్ణవమవుతుంది కుటుంబాల పరిమితి కోసం ప్రభుత్వం ఊరూర, వాడవాడ బారీ ఎత్తున ఉచిత సౌకర్యాలు కల్పిస్తున్నది



యువతీయువకులు పెళ్ళికి తొందర పడకుండా వివాహ వయో పరిమితిని పాటించడం శ్రేయస్కరం యువకులకు 21 సంవత్సరాలు యువతులకు 18 సంవత్సరాలు వివాహ వయో పరిమితి ఈ పరిమితి ఈ నాటి ప్రధాన ఆవశ్యకత



మొదటి బిడ్డ తరువాత కనీసం మూడు సంవత్సరాల వ్యవధి ఇచ్చి రెండో పాప గురించి ఆలోచించండి కాన్పు తరువాత వెంటనే కాన్పు తల్లీ బిడ్డల ఆరోగ్యానికి ప్రమాదం నిరోధ్, కాపర్ టి గర్భ నిరోధక నోటి మాత్ర తాత్కాలిక సంతాన నిరోధక సాధనాలు ఇవి సాంసారిక సౌఖ్యానికి మార్గాలు



ఇద్దరు బిడ్డలతో ఇక కుటుంబ పరిమితి పాటించడం మేలు వేసక్టమీ, ట్యూబెక్టమీ లాపరోస్కోపిక్ ట్యూబెక్టమీ శాశ్వత సంతాన నిరోధక పద్ధతులు ఇవి ఆరోగ్యానికి, ఆనందానికి సోపానాలు తల్లీ, బిడ్డల ఆరోగ్య పరిరక్షణకు పలు రోగ నిరోధక చర్యల అమలు ఒక విశేషం

## మొదటి బిడ్డ పిదప మూడేళ్ళకు మరో బిడ్డ మేలు
## రెండో బిడ్డ తరువాత ఇకచాలు.

రాష్ట్ర కుటుంబ సంక్షేమ విభాగం, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్.

# అందాలకు నాంది ఆప్కో చేనేతలు

ఆభరణాలు ఎన్ని ధరించినా సరే
ఆప్కో చీర కడితే గాని అలంకారం
పూర్తి కాదు. సంతృప్తి రాదు. కట్టి
కున్న వెంటనే మదిలో
కదలాడతాయి పుట్టెడు ఆలోచనలు
అన్ని ఆలోచనలూ ఆప్కో చుట్టూ
అల్లుకుంటాయి. చూసిన
వాళ్లందరూ అందంగా వున్నావని
మెచ్చుకుంటుంటే ఆ ఘనత
ఎవరిదని చెప్పనూ?
......ఇంకెవరిదీ? అందాలకు నాంది
పలికే ఆప్కో చేనేతలది. అవును!

ఆప్కో




ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
హైదరాబాద్ 500029

kiron/apco/85